# శైవప్రచారిణీకార్యాలయమున
## వెలకు దొరకు గ్రంథములు

| | | గ్రంథమాల చందా దాయలకు | ఇతరులకు |
|---|---|---|---|
| 1 | కాశీసారము | 0 1 3 | 0 2 0 |
| 2 | భద్రాయురుపాఖ్యానము | 0 8 0 | 0 12 0 |
| 3 | విద్యాస్థానవినిర్ణయము | 0 8 0 | 0 12 0 |
| 4 | శైవసిద్ధాంత దర్శిని. | 1 4 0 | 1 8 0 |
| 5 | ఉపదేశకాండము | 3 0 0 | 3 8 0 |
| 6 | సరసహృదయానురంజనము | 1 8 0 | 2 0 0 |
| 7 | స్కాందమహాపురాణము సంభవకాండము సంస్కృతము తాత్పర్యము తోసహా | 3 0 0 | 3 8 0 |
| 8 | సంభవకాండము వచనము | 1 4 0 | 1 8 0 |
| 9 | సోమవార వ్రతకల్పము | 1 0 0 | 1 8 0 |
| 10 | సర్వామధురము | 1 0 0 | 1 0 0 |
| 11 | వీరభద్రాష్టోత్తరశతనామావళి | 0 3 0 | 0 4 0 |
| 12 | వీరభద్రస్తోత్రకదంబము | 0 8 0 | 0 12 0 |
| 13 | భక్తపాల శతకము | 0 1 3 | 0 2 0 |
| 14 | శరభాంక లింగశతకము | 0 3 0 | 0 4 0 |
| 15 | గీతగౌరీశకావ్యము | 0 8 0 | 0 8 0 |
| 16 | అగ్నిముఖము జయాదులు | 0 3 0 | 0 4 0 |
| 17 | విఘ్నేశ్వరపూజపుణ్యాహవాచనము. | 0 2 0 | 0 3 0 |
| 18 | శివయోగసారము 1 వ భాగము | 1 0 0 | 1 4 0 |
| 19 | ,, 2 వ భాగము. | 1 0 0 | 1 4 0 |

వలయువారు

శైవప్రచారిణీ వరంగల్ అని వ్రాయవలయును.

శైవప్రచారిణి గ్రంథమాల ౧౫

# శివయోగ సా




రెండవ సంపుటము.

ఇది

బ్ర॥ శ్రీ॥ విద్వాన్ ముదిగొండ వీరేశ లింగ శాస్త్రిగారిచే

తాత్పర్యము వ్రాయబడి,

బ్ర॥ శ్రీ॥ కొడిమేల రాజ లింగా రాధ్యుల వారిచే

శైవ ప్రచారిణీ ముద్రాక్షర శాల యందు

ముద్రింపం బడియె.

కాపీలు. ౧౦౦౦

చందాదారులకు వెల 1-0-0 | 1927 | ఇతరులకు వెల 1-4-0

# రాజపోషకులు.

1 బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతా సార్ రాజా కందుకూరి బాలసూర్య ప్రసాదరావు జమీందారుగారు. దేవిడి.

# శాశ్వతాభిమానులు.

1 మ॥ రా॥ కొమరవెల్లి కాశయ్యగారు. వరంగల్.
2 మ॥ రా॥ భూపతి రామయ్య గారు. వరంగల్.
3 మ॥ రా॥ భూపతి రత్నంగారు. వరంగల్.
4 మ॥ రా॥ నాగబండి కట్టుమల్లయ్య గారు. వరంగల్.
5 మ॥ రా॥ కొండూరి రామలింగం గారు. వరంగల్.
6 మ॥ రా॥ కుంచం దుబ్బయ్య నాగయ్యగారు. వరంగల్.

# శాశ్వత చందాదారులు.

1 బ్ర॥ శ్రీపతి పండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు మట్టెవాడ.
2 బ్ర॥ ముదిగొండ రాజమాంబగారి మల్లయ్య అయ్యవార్లంగారు వరంగల్
3 బ్ర॥ శ్రీ॥ శివదేవుని వీరేశలింగారాధ్యులవారు వరంగల్.
4 మ॥ రా॥ అల్వైదన్నగారి నారాయణ సింగుగారు వరంగల్.
5 మ॥ రా॥ పెద్ది వీరయ్యగారు మట్టిముచ్చాల
6 మ॥ రా॥ ములుగు కిష్టయ్యగారు సిద్దిపేట.
7 మ॥ రా॥ కొమరవెల్లి శివరాజంగారి అంతయ్య గారు. ”
8 మ॥ రా॥ భూపతి బుచ్చిరామయ్య గారు. ముల్కనూరు

# విషయసూచిక

—— :*: ——

శివయోగ సారము— ఉత్తరభాగము— ద్వితీయాశ్వాసము.

# విషయసూచిక.

విషయము



సమాప్తము.





శ్రీ రాజేశ్వరాయనమః

# శివయోగసారము

## ఉత్తరభాగము.

### ద్వితీయాశ్వాసము.



కర శివయోగజ్ఞా
నాకర మహనీయ మూర్తి యతులిత కీర్తి
స్వీకృత గుణవైభవ య
స్వీకృత భవ!నూక నార్య! శ్రీగురు వర్యా! ౧

తా. సర్వ సంపదల కొలవాల మగు శివయోగ జ్ఞాన మహిమచే సంసార సముద్రమును దాటి కీర్తిశాలివై వెలయుచు నూకనా రాధ్యుడను పేరుచే బ్రకాశించుచున్న గురువర్యా!

ఆ. వె. శైవ యోగశాస్త్ర సారస ముచ్చయ
ప్రకరణముల యర్థ భావమెల్లఁ
దెనుఁగు కవితఁ దేట తెలివిగ నీభవ
దాజ్ఞ విన్నవింతు నవధరింపు. ౨

తా. మీయాజ్ఞను శిరసావహించి శివయోగ శాస్త్రము నందలి భావమునంతయుఁ

తను గెలుగుటను నజహరి
ప్రముఖుల పదవులును దుఃఖ బహుళములు గదా. ౧౦

తా. ఈ రాజ్యములఁ గోరిన దేవతలకే సుఖములేదు. ఇంద్రాదులు స్వర్గాధిపత్యము వహించి తమకంటె బలవంతులగు రాక్షసులచేఁ బాధ వింపఁబడిరి. ఇంద్రునికన్న గొప్పవాఁడు బ్రహ్మయును- బ్రహ్మకన్న గొప్పవాఁడు విష్ణువు నుండుటచేతను, స్వర్గముకంటె సత్యలోకము- సత్యలోకముకంటె వైకుంఠము- నుండుటచేతను, వానికిఁ బ్రళయ కాలములందువినాశము-గల్గుటచేతవిష్ణ్వాది దేవతలస్థానములుదుఃఖభూయిష్ఠములు.

క. వనజాసనేంద్ర పదవులు
సనఘులు మదిలోనఁ గోర రనినఁ స్రక్చం
దనవనితాదుల భూలో
క నివాస సుఖంబుఁ గోరు కష్టులు గలరే. ౧౧

తా. బ్రహ్మాది దేవతల స్థానములే తత్త్వజ్ఞులు గోరరని వచించినచో, తుచ్ఛములగు స్రక్చందన వనితాది భోగములఁ గోరుమూఢు లుందురా?

క. వేమఱు సంకల్పంబునఁ
గామము జనియించు దీని క్రమ మెఱిఁగి జనుం
డేమియు సంకల్పింపక
తామసగుణ ముడిగెనేని తత్త్వజ్ఞుఁ డగున్. ౧౨

తా. ఈ కామము [కోరిక] సంకల్పమునఁ బుట్టుచున్నది. ఈ విషయమును మానవులు తెలిసికొని, తామస గుణము వలన కలిగెడి సంకల్పము నేవదిలినతత్త్వజ్ఞానులగుదురు.

క. కామింప వలవ దెద్దియుఁ
గామించిన మోక్షసుఖముఁ గామింపఁ దగున్
భూమినట మీదఁ మోక్షముఁ
గామించుట మిగుల బుద్ధి గాదండ్రు బుధుల్. ౧౩

తా. ఏదియుఁ గోర కూడదు. కోరినచో భూమియందు మోక్ష సుఖమువంటి సుఖమును గోరవచ్చును. అటుమీఁదఁదిరిగి మోక్షమే కావలయునని కోరుటతగదనిపండితులు చెప్పుదురు.

ఆ. వె. కామము భయకర్మ కారణంబగుఁ గర్మ
జాలమెల్ల దుఃఖ మూల మెపుడుఁ
గామిమోక్ష సుఖముఁ గనలేఁడు గాన, నా
కామ మఖిల దోష కారణంబు. ౧౪

తా. ఇహలోక సౌఖ్యమునకుఁ బరలోక సౌఖ్యమునకుఁ గారణము కామమే గాని, వేఱియొకటి గాదు. కర్మాచరణము దుఃఖ మూలము. నిరంతరము కోరికలఁ గోరు మానవుఁడు మోక్షసౌఖ్యము నొందనేరఁడు. కావున, కోరిక సమస్త దోషములకు స్థానమైనది.

క. తనపర తత్త్వముఁ దెలియక
మనుజుం డీ దుర్భవంబు మఱగుచు గామిం
బనిశము నెచటికి నీడ్చినఁ
జనుశునకము వెనకఁ దోఁకఁ జనుచుండమునన్. ౧౫

తా. కుక్కతోఁ దోకపోయినటుల జనుండు పరతత్త్వమును దెలిసికొన నేర్వక సంసారనరక కూపమున మునుగుచుఁ దేలుచు కామ మెచటికిఁ దీసికొని పోయిన నచటికిఁ బోవుచున్నాఁడు.

కామమహిమ.

చ. జపములు తత్త్వబోధనములు సద్వ్రత చర్యలు దేవపూజలుం
దపములు నాదిగా బహువిధంబుల నిష్ఠలిహంబు నందు హే
యపుఁగడు నల్పభోగములకై పచరింపఁగఁ జేసి సర్వముం
గపటముగా నొనర్చునది కామముగాదె తలంచి చూడఁగన్. ౧౬

తా. కొందఱు ధనాశ చేతనో, ఇతరులు మహాత్ములని యనుకొనవలయు ననియో కీర్తి నిగోరియో, అల్ప భోగములకై మనస్సొక దిక్కు- ఇంద్రియము లొకదిక్కు- బయ ల్కిడుచుండ, నిరోధించి జపములు- తపములు- పూజలు- మహానిష్ఠతోఁ జేయుదురు. ఇది యంతయుఁ గామము (కోరిక) వలననేగదా?

సీ. బ్రహ్మాదులఁ బట్టి బతిమాల్చుఁ గామంబు
వసిష్ఠమహర్షుల భవవార్ధిఁ గూల్చు

ప్పర స్త్రీలెందఱుగలరు! ఉన్నను, కామాతురుడై స్వర్గాధిపతియగు మునిభార్యయగు నహల్యను, గామించెను. కారణ మేమనగా:— హృదయమును పొడ కామాగ్ని వలన దహించబడు చుండఁగా మంచిచెడ్డలను బండితుండు గూడ విచారింప నేరడని యభియుక్తులాన తించుటయే.

శ్లో॥ అర్థాతురాణాం నగురుర్నబంధుః। క్షుధాతురాణాం నరుచిర్నపక్వం।
విద్యాతురాణాం నసుఖం ననిద్రా। కామాతురాణాం నభయం నలజ్జా॥

తా. ధనాశ గలవారు బంధువులని గురువులని తలంచక ధనమార్జింతురు. ఆకలి గలవారు రుచియున్నదని గాని, లేదని గాని, పచన మైనదని గాని, లేదని గాని, తలంపక భుజింతురు. విద్యా వ్యసనము గలవారు సుఖమును గాని, నిద్రను గాని చక్కఁగా ననుభవింపరు. కామాసక్తులగు పురుషులకు లజ్జాభయములు లేవని తాత్పర్యము.

సీ. దుర్మదాహంకార । దుష్కర్మ దుర్గుణా
ధీనులై బుద్ధిని । హీనులగుచు
దాంతి శాంతి క్షాంతి । ధర్మదయాదాన
దూరులై పన్నగ । క్రూరులగుచు
గాయక నటవిట । గణికాది దుర్జన
మిత్రులై సజ్జన । శత్రులగుచు
బహుళ వృథాజల్ప । పరపీడ నాన్యాయ
నిరతులై దుర్మార్గ । చరితులగుచుఁ
తే. గీ. క్షాత్రమెఱుఁగని చెనఁటి నృ। పతులయిండ్ల
కట్టినియ తాత్ములకు నైన । నేఁగఁ జేసి
ద్వారసీలయములు వారింప । నారనచట
నిలువఁబెట్టుఁగా మమునాదె । నెట్టివముగ. ౨౧

తా. ధనమదాంధులై కన్నుమిన్ను గానక, దయాధర్మములు, శమదమములు, విడిచి వేశ్యాలోలురై సంచరించుచు, దుర్జనసహవాసమున కానందించుచు, గన్నపాత్రాపాత్రవిచక్షణత లేని రాజాదుల ద్వారములనొద్దకు నెట్టి సజ్జనులైనను, ఎట్టి మహాత్ములైనను ఖండించి నిలవబెట్టునది యీ కామమే గదా?

ఆ. వె. ఎంతవారికైన ◊ నెంతయుఁ బాటులఁ
బఱమనసిన నింక ◊ బ్రజ్ఞ లేల?
హీనజనులఁ జెఱుప ◊ నొంటిటి పనిపాప
కర్మహేతువైన ◊ కామమునకు. ౨౩

తా. పాపమునకు హేతువగు నీకామము, ఎంతటి మహనీయులనైనఁబరిహాసపాత్రులను గాఁజేయుచుండ, హీనుల విషయమై యడుగనేల?

క. కామంబు కెలమునం గల
నేమంబులు నిపుణతలును ◊ నీరజ ముఖులుఁ
ధామములు మొదలు గాఁ గని
నేమియు నొల్లక చరింతు ◊ రిద్ధచరిత్రుల్. ౨౪

తా. సత్పురుషులీ కామ భయముననే స్త్రీలు, కర్మలు, గృహములు, మొదలగు వాని వదిలి పెట్టుదురు.

క. భువిఁగామ యుక్తిగలవై
భవములు విషగర్భ మధుర ◊ ఫలములు కామం
బువిడు నవఁదగు దుఃఖంబులు
లవిరి యమృతి కరములైన ◊ తిక్తౌషధముల్. ౨౫

తా. జ్వర పీడితునకు, మధుర పదార్థము విషమైనటులను, చేదు పదార్థ మమృతమైనటులను, మోక్షము నంద భిలాషగల వానికిఁ గామమువలన సంభవించెడి వైభవములు, విషమయములును, అందు వలన వచ్చెడి దుఃఖములు, అమృతమయములును నగును.

క. పంచ మహాపాపములకుఁ
జంచల గతిఁనుండఁదగిన ◊ సదనము గామం
బంచితము ఖ్యాచారం
బించుకయును గలుగనేర ◊ దెత్తఱినైనన్ ౨౬

తా. కామము పంచమహా పాతకములకు నివాసము. కామాసక్తుఁడగు వానికే సమయ మందును సదాచారము గలుగదు. పంచమహాపాతకములేవియనః బ్రహ్మహత్యా. కం

ద్రాగుట, బంగారము దొంగిలించుట, గురుభార్యను బొందుట, ఈ నలుగురిలో నెవరితో నైన గూడి యుండుట.

క. విదితంబుగా విరక్తిం
బొదలక సంసారమాయఁ ♦ బొందుట దీయా
స్పదమెద్ది యనిన నిజముగ
మదిఁజూడఁగఁ బుష్పశరుని ♦ మాయయె కాదే. ౨౭

తా. జనులకు వైరాగ్యము గలుగక సంసారము నందతి ప్రేమ గలుగుటకుఁ గారణము మన్మథ మాయయే గదా?.

ఆ. వె. మరుని మాయవలన ♦ మఱుగుట యొప్పదు
వాఁడు దోషకారి ♦ వాని చేత
నమర వరులు మునులుఁ ♦ దమ మానములు గోలు
పోయి మిగుల మోస ♦ పోయినారు. ౨౮

తా. మన్మథ మాయకులో బడుట మానవులకు నుచితము గాదు. ఆమారుని చేతనే బ్రహ్మ తనకూతు నందును, విష్ణువు, గోపిక లందును, రుద్రుఁడు ముని యువతు లందును దగుల్కొని నారు. మహారణ్యము నందుఁ గంద మూలఫలములఁ దినుచు నారీ ముఖము గాంచని ఋష్య శృంగాది మునులు సదా వేశ్యా రత్నముల పాదపద్మములందు దాసులై పడియుండి యాత్మ గౌరవమును గోల్పోయినారు.

క. వేయును నేటికి మన్మథు
మాయతొలుత జవిఁజూడ ♦ మధురము సహజం
బైయున్న విషం బిదియక
దాయెందును మోసపోక ♦ తనరుట యొప్పున్. ౨౯

తా. పలుమాటలతోఁ బనియేమి? కాంతా సంభోగాది మదన చేష్టలు చవిచూచి నంతనే యెంతో మధురముగా నుండును. విచారింపగా నంతటి విషము లేదు. కావున పంచబాణుని కుసుమ బాణముల వలన మోసపోకుడు.

క. కాముఁడు నిరంతరంబును
దాముందటి నమరనొద్దిఁ తరుణుల నెడియు

ద్దామంపుటుపులఁ బగులు మ
నేమఱియుండంగ వలపన్నిదిటనియతనునరుణ్. ౩౦

తా. కాముఁడను వేటకాఁడు పురుషులను మృగములఁ బట్టుకొనుటకై నారీరత్నములను వలలను బన్ని దాగి యున్నాఁడు. కాన జాగరూకులు గండు.

క. కడుఁ దెల్లని వెండ్రుకలును
బడఁ బోయెడు నొడలుఁ గలిగి ప్రాయంబొకనాఁ
డుడిపోవుట గల్గినమదిఁ
గడమోదుగదా మనోజు గర్వంబెప్పుడున్. ౩౧

తా. వెండ్రుకలు నెరయుటయు, శరీరము ముసలి తనమున పసదప్పుటయు గలిగినను, దానిమహిమయే మోగాని, కామము మాత్రము పోవదు గదా?.

సీ. కపటంబు పోకను ద్గతి త్రోవసద్గతి
మఱప సత్యంబులకునికి పట్టు
పరధనహారియు స్థిరముల చక్కిఁదా
రౌరవనరక సంప్రాప్తకారి
ధర్మాబ్జమిత్రకం ధరపటలంబిది
యభిమాన విపినదావాగ్నిమూర్తి
పృథుతరధైర్యధాత్రీధరకులిశంబు
కులశీలములు రెండు పొలయునెలవు
తే. గీ. తగులువడి పాయఁగా రానిజిగురుఁ గండె
యపయశః ప్రాప్తులకు నెల్ల నాలయంబు
వితతసద్గుణ రాశికి వెన్నుగుదియ
మరునిమాయ యొకాకొందు మఱియుఁ గలదె. ౩౨

తా. మన్మథుని మాయలోఁ బడిన జనుఁడు చేయు పనులు, మాటలాడు వచనములు, అన్నియు దోష భూయిష్ఠములు. అతఁడు కామాధీనుఁడై యనృతములు పల్కును, పరధనముల నపహరించును. అధర్మము లాచరించును. అభిమానము విడుచును. కులశీలము త్యజించును. చివర కపకీర్తి పాలగుట యగాక నరకము గూడ ననుభవించును.

ఉ. లేఁతలలోన నెల్లఁగడు లేఁతకృతాంతుని సమ్ముఖంబు దా
రోఁతలకెల్లఁ బుట్టినిలు రోషము కంటు పమ్మృత్యుమూర్తి పె
న్పాతక సమస్త దోషములు నుండెడు నిక్కఁపుఁ దంగి యెవ్వఁడు
చేతికిఁ జేఁదుదుష్టమిఁది చిత్తజు మాయఁ దలంచి చూడఁగన్. 33

తా. సుకుమారములగు వస్తువులలో మిక్కిలి సుకుమారము, యమపుర కేకటపు ద్వారము, సకల పాపముల కాలవాసము; మన్మథ మాయయే గదా?

క. అనము విరక్తుల మనుచుం
బసరింపుదు రేలకోసర్ భలకొందఱు దా
రసమాక్షుఁడొకఁడు దక్కం
గుసుమాస్త్రుని కెవ్వరెదురగ్ గుదురూహింపంగన్. ౩౪

తా. "మేము విరాగులము, మేము, విరాగులము" అనుచు సభలలోఁ గొందఱు ప్రజలు సంతోషించుటకై పల్కుదురు; గాని, నిజము విచారింపఁ గాఁ బుష్ప బాణుని గెల్చిన మహాను భావుఁ డీశ్వరుఁ డొక్కరుఁడే గదా?

—* ఉత్సాహ *—

తెమలకెప్పుడు నీటిలోనఁ దేలుచుండు వారిత
ధ్యములఁ గరికకాయల దినన్ మైనవారిఁ గావిగో
చములఁ గట్టువారినైన నగుచుఁ జిత్తజుండు చి
త్తము గలంచి చెఱుచుననిన్ దమలు దష్టములగదా. 3౫

తా. ఉమా! కాలమునకే లేచి నిత్యకృత్యముల దీర్చుకొని యెంతటి శీత లోదకంబులైనను "శివ– శివా" యని మునుగుచు; గరక కాయలఁ దినుచుఁ, గావి గోచీల బిగించికొని తపంబొనర్చు విశ్వామిత్రాది మౌనీంద్రుల నెందఱను మదనుఁడు తన కుసుమబాణములకు గురిగాఁ జేయ లేదు?

చ. మనసిజకేళి నేర్పునన్ మానవిలాసములోలి లోలలో
చనగరువంపు చందమునఁ జయ్యనగోమల హాస్య హల్లకం
బునఁ గొనఁ జెట్టవట్టి రతిన్ బొందునకీయ కొనంగఁ జేయఁ జూ
చినధృతి కల్మియెల్లఁ దనకే శిష్టగదా శివయోగి యెల్లెడన్. 3౫

తా. రతికేళియందు సౌందర్యము గలిగిన, మాటల ప్రసంగము లను చాతుర్యము నార్జించి, మాటల యందున్నై ప్రజ్ఞను సంపాదించి, తనకుట్ల చెప్పులచే, సరా జలావణ్యముచే నెంతటి ధీరుడైనను వేస్త్రి విభుసులతో స్వాధీనము జేసి కొను కాంతామణి వచ్చి యాచించినను, ఏ మహాత్ముడు మనస్ఫూర్తిగ నిరాకరించునో, ఆతఁడే శివయోగి సుమీ.

క. కామాతురునకు నిష్టన
సేమంబను మాననుచటఁ గేమను నిజమున్
దేమియు సందియము వలవ
దామీఁదఁ బరత్రహాని యగునందురు బుధుల్. ౩౬

తా. కాముకునకు, నిహలోకమున సుఖము కలుగునో లేదో సంశయము; నానికీర్తిమాత్రము తప్పక కలుగును. ఇందుకు సందియము లేదు. కాములోలునికి పరలోకమున హానికలుగుట సత్యమని విద్వాంసు లందురు.

వ. కావున. ౩౭

తా. కాబట్టి.

క. మాటలు వేయుం జెప్పఁగ
నేటికిఁదను నాత్మఁ జూడఁ నీకసతతముగా
మాటైయున్నను నోజని
గీటణఁపక శివునిజూను క్రియనొప్పునసే. ౩౮

తా. వేయి మాటలతోఁ బనియేమి? తనను, యాత్మయందుఁ జూడనీయక యడ్డముగా నున్న మన్మథుని జంపక శివుని జూచుటకు వీలులేదు.

తే. గీ. తనకుఁ బుట్టినమన సిజుఁ ద్రౌ నణఁగఁగి
పట్టికుదియించి తాశిఖుఁ బెట్టలేఁడు
తెలిసి విశ్వాధికుని మహా దేవుఁబట్టి
లోపఱుచుకొననెట్లు చాలునుజనుండు. ౩౯

తా. తనకు జన్మించిన వాఁడగు మనసిజుని దండింప శక్తిలేని వారలు విశ్వాధికుఁడగు మహాదేవునిలోఁ బరచుకొను శక్తి గల వారగుదురా?

ము. పరవిత్తం బణుమాత్రమైనఁ బారయక ॥ భావింపకే భంగులం
బరకాంతం బరికింప కెట్టి యెడలన్ ॥ భద్రంబుగాఁ జూచుచుం
బరితృప్తి స్థితియున్న భావభవునిం ॥ భజింపుమా నిక్రియం
బరమజ్ఞానుల కిట్టి కామహరణో ॥ పాయం బెఱుఁగం దగున్. ౪౦

తా. పరధనమును మట్టివలెఁ దలంచుటయు, పరకాంతలఁ దల్లులవలె భావించుటయు, సదా పరమేశ్వరు నుతించుటయు, కామము నణంచుటకుఁ దగిన యుపాయములు

వ. అదియుం గాక. ౪౧

తా. అంతియ గాక.

క. వేడుకతోఁ బరనారులఁ
జూడంగా వలదు తప్పి ॥ చూడఁ బడినఁదాఁ
దోడం బుట్టిన వారల
తోడియటులు చూడఁదగు న ॥ తుల ధైర్యమునన్ ౪౨

తా. పరస్త్రీలను, జూచుటయే మంచిది కాదు. చూచినచోఁ దన సహోదరీమణులతోఁ బాటు చూడవలయును.

క. ఈలాగునఁ జరియింపఁగఁ
దూలును భావజుని మాయఁ ॥ దూలఁడు ముక్తిన్
శ్రీలీలఁ గల్గు ముక్తికి
మూలము వైరాగ్య మండ్రు ॥ మునివరు లెల్లన్. ౪౩

తా. ఇటు చరించువాఁడు, మన్మథ మాయలోఁ బడక ముక్తి నొందును. మునీంద్రు లందఱు ముక్తికి వైరాగ్యమే మూలమనిరి.

## క్రోధస్వరూపము.



క. తొలితొలి శిఖితన పుట్టిన
యిలుగాల్పక యొరులయిండ్ల ॥ కేగునె కోపా

సలమును మునుదను గాల్పక
యలిగిన మెఱకేగునేర ♦ యంబాల యగుర్.          ౭౭

తా॥ అగ్ని యంటు కొన్న యిల్లును, సాంతముగ గాల్చక యిరుగుల యిండ్ల కాల్చని యటుల, గోపము గలిగినచో నది మొదట తనను నశింపఁ జేయక శత్రువుల వాదికిఁ బోవదు.

క. కోపంబనఁ బాపంబన
నేపట్టున వేఱుగలదె ♦ యెప్పుడును మదిలోఁ
గోపము విడువని పాపికిఁ
బ్రాపించునె యిహపరార్థ ♦ ఫలములు ప్రీతిన్.          ౭౫

తా॥ కోపమునకును, పాపమునకు భేదములేదు. రెండు నొకటియే యని యార్యులు వచింతురు. కాన, అట్టి పాపాత్మునికి నాపర సౌఖ్యము గలుగునా?

క. శోధించి చూడ నొక్కొక
చోదాత్మ ప్రముఖులైన ♦ సురలున్ మునులుం
గ్రోధ విధేయులు గారే
క్రోధంబున శత్రుగెల్వఁ ♦ గు మతుల తరమే.          ౭౬

తా॥ దేవత లేమి? మునీంద్రులేమి? ఒక్కొకచోఁ గ్రోధమునకుఁ లోఁబడి చేయరాని కార్యములు సేయలేదా? కానఁ గ్రోధమున శత్రువుల జయించుట దుర్లభము.

* ఉత్సాహము. *

నరయ దుఃఖహేతు ♦ వై జనించు క్రోధసంగతిం
బురుషునకుఁ దపంబు గాలి ♦ పోవుజపము నీరగున్
కరుణసేల గలియు సత్య ♦ గరిమగ్రాఁగు మతిజెడుం
బరమ సుగుణ వితతు లెల్ల ♦ బదటఁ గలియుఁ జయ్యనన్. ౭౭

తా॥ సర్వదుఃఖములకు, నిలయమగు క్రోధమున్నచో యామానవుని తపంబు మంటిపాలగును, జపంబు నీరయి పోవును సత్యము, దయ, మొదలగు సద్గుణములన్నియు మహార్ధకాలములో నశించును.

వ. అక్రియమునకుం గాథ. ౪౮

తా. పద్యము.

సీ. అగ్నిపుట్టిన యింట నఖిల వస్తు చ
యంబును భస్మమై నట్టు క్రోధ
వహ్ని యెవ్వని కుద్భ వంబగు వాని స
కల సుకృతంబును క్షణము లోన
యమని యమములతో శమదమంబుల తోడ
ఘనసీతి శిఖులతోఁ గాలి కసరి
పోవుఁ గావునఁ గ్రోధ భావమున్న కతనఁ
గలుగాయువు బ్రహ్మ కల్పకోటి
తే. గీ. కోటులెంతైన నెట్టికిఁ గ్రోధరహిత
మైన యాయువ్వ యదినము సార్థమాత్ర
మైన భావన సాధక భద్రప్రదంబు
మాన నిర్వాణ సుఖదము మానవులకు. ౪౯

తా. నిప్పుల బడిన యింటి యందున్న వస్తువు లన్నియు నెట్టుల భస్మమై పోవునో అటులే క్రోధముగల వాని సుకృత మంతయు భస్మమై పోవును, క్రోధముగలవాఁడు పాపకృత్యములు చేయవలసి యుండుటచేత బ్రహ్మకల్పములవరకాలము బుట్టుచు గిట్టుచుండును. క్రోధరహితుఁడై క్షణకాలము శివుని పూజించినను నాతఁడు ముక్తి చెందును.

* ఉత్సాహము. *

మాలవాఁడు మాలవాఁడె మాలయైన శాంతి సం
శీలుఁడైన ముని సమాన శిష్టుఁడే యాట ని
ట్లోలిఁ దెలిసి క్రోధముడిగి యున్నఁ గాని సత్క్రియా
జాలముల్ ఫలింప వండ్రు జగతి బుధజనోత్తముల్. ౫౦

తా. శాంత్యాది గుణములతోఁ గూడినచో చండాలుఁడు చండాలుఁడు గాఁడు. వాఁడు మునీంద్రుఁడు. కావున నీ విషయమును దెలిసి కొన్ని క్రోధము వదలియున్న గాని తాము చేసిన సత్క్రియలు ఫలవంతములుగా జాలవు.

తే. గీ. పానలేటికిఁ గ్రోధంబుఁ బాయలేని
పచ్చిమాలకు వేదోక్తి భవ్యనిష్ఠ
లేమిటికి నేటి గురుభక్తి యేటిశివుని
భక్తివానికి నెక్కడిభక్తి భక్తి. ౫౧

తా. క్రోధంబు వదలజాలని వానికి ప్రాణమెందుకు? వేదోక్త మంత్రాచరణము లెందుకు? గురుభక్తి యెందుకు? శివభక్తి యెందుకు? అట్టివాఁడు విచారింపగా చండాల సదృశుడగును సుమా? వానికిభక్తి యుండినను నిష్ఫలము.

ఆ. వె. ఎందుఁ గ్రోధయుతున కెక్కడి శివయోగ
మీశ్వరునకు వాని కెన్నిచాళ్ల
పెట్టువానిని యమపెట్టి దైనను నది
రోఁతగాదె రాజెఱుఁగని వెట్టి. ౫౨

తా. క్రోధముగల వానికి శివయోగ మబ్బనేరదు. అట్టి వాఁడు శివునిగూర్చి యెన్ని నియమముల వలంబించినను వ్యర్థము సుమా? రాజెరుగని వెట్టిచేయుట వలన గష్టమధికమే గాని భోగంబణు మాత్రము లేదు సుమా?

క. మును గ్రోధానలమితరుల
ఘనకౌటిల్యంబు వలన గలుగుట నదిదా
ననవరతంబును శమతా
వనధారలఁ జల్లనార్ప వలయు నిజముగాన్. ౫3

తా. ఇతరుల కుటిల సంభాషణములవల్లను- ప్రవర్తనమువల్లను- క్రోధాగ్ని జనించుచుండును. బుద్ధిమంతుఁ డద్దానిని శాంతి యనెడి యుదకధారలచేఁ జల్లార్చుచుండవలయును.

— * లోభ స్వరూపము. * —

ఉ. లోభము సర్వదుర్గుణములుం వసియించిన చోటు వైభవ
ప్రాభవ పుణ్యసంపదల హాయనుఁ బొందఁగఁ జేయుసద్యశో
లాభముఁ జెంద నీదనితలంచినఁ దానియతాత్ము లెన్నఁడున్
లోభముపొంతఁ బోరుభువిలోపల నెంతయు బుద్ధిమంతులై

తా. లోభము సర్వ దుర్గుణముల కాలయము. అందువలన కీర్తి ప్రతిష్ఠలు నశించును. పుణ్యసంపద లడుగంటును. గాన ధీమంతులు లోభము చెంత బోక చరింతురు.

క. కలలోని జాడనస్థిర
ములు హేయంబులు నసార ములునైన ధనం
బులు లోభ వశులు సుస్థిర
ములనుచు మదినమ్మి మోస పోదురు జగతిన్. ౫౫

తా. కలయందుఁ జూచిన వస్తువులవలె నస్థిరములై తుచ్ఛంబులగు ధనంబులనే నమ్మియసారమగు సంసారమున ఈడిసీదులాడుచు దరి గాంచక లోభపిశాచమున నావరింపబడి కొందఱు సంచరింతురు. కాని యదియెంత యొనర్పు యోజనము.

సీ. తల్లిదండ్రుల నైన దగు తరుణుల నైన
విడుతురు లోభంబు విడువలేక
నిజకుమారుల నైన నిండు బల్గము నైన
విడుతురు లోభంబు విడువలేక
బంధుజనుల నైనఁ బరమ మిత్రుల నైన
విడుతురు లోభంబు విడువలేక
భవ్యశీలము నైన ప్రాణంబు లైనను
విడుతురు లోభంబు విడువలేక
గీ. వారిఁగనుఁగొని లోభవి దూరులైన
వారునగుచుండుదురు సువి చారలీలఁ
జారునిర్వాణ లక్ష్మికి వారె కారె
భర్త లగుదురు శివ యోగ భరితు లగుచు. ౫౬

తా. లోభులు గడ్డి గవ్వయైనను ధనంబును వదలలేక తల్లిదండ్రుల నైనను- కుమారుల నైనను- భార్యల నైనను- బంధువుల నైనను- మిత్రుల నైనను- చివరకు ప్రాణము నైనను వదలిపెట్టుదురు. అక్కటా! ఇట్టివారిని జూచి లోభరహితులునవ్వుచుందురు. విచారింపగా నిట్టి వారలే కదా? మోక్షలక్ష్మీకృపా కటాక్ష పాత్రులగు చున్నారు.

ఆ. వె. లోభిమర్దనుండు లోభికెక్కుడి శివ

భక్తి? దోటి యోగ, యుక్తి? యొందు-
వాని కేల గల్గు, నంభుక్తిముక్తులు
వాఁడు సత్పథంబు వాఁడుగాఁడు. ౫౭

తా. లోభిదుర్జనుఁడు సమానులు. శివయోగము గాని, శివభక్తి గాని లోభికిఁ గలుగనేరదు. సన్మార్గమున వాఁడెప్పుడు చరింపఁడు.

క. ఘనలోభన శాత్మనిధన-
మనలంబునఁ గాలు నొండెఁ నంబువుపాలౌ-
జననాథుఁ జేరుఁ జోరులు
గొనిపోదురు మూషకములు గొనిపోవు నొగిన్. ౫౮

తా. లోభిధనము దొంగల పాలగును. లేనిచో నగ్నియందు గాలిపోవును. లేనిచో నుదకము పాలగును. కానిచో రాజుచే నపహరింపఁబడును. ఎవరికిఁ జేర నిచ్చో మంటి పాలగును. సందియము లేదు.

క. గురువులకును దేవరకును
వరభక్తులకును మునీశవరులకు దీనా-
తురులకుఁ జేరును లోభము-
బోరియని యనఘాత్మ ధనము బుధులు నుతింపన్. ౫౯

తా. లోభిగ్వాదు లేనివానిధనము దేవతలకు- గురువులకు- భక్తులకు- పండితులకు- దీనులకుఁ జేరును.

క. లోభము విడువఁగ నేరని
ప్రాభవ పురుషుండు నిత్య పటుయశోయుఁడు గదా-
లోభము విడువఁగ నేర్చిన
ప్రాభవ పురుషుండు నిత్య పటుయశుఁడు గదా. ౬౦

తా. లోభమును విడువ జాలని వాఁడు జీవించియు మరణించినవాఁడే. లోభమును విడిచినవాఁడు మరణించినను యశశ్శరీరమున జీవించియున్నవాఁడే యగును. లోభికి నష్టకీర్తియు- దాతకు గీర్తియు గలుగునని భావము.

ఆ. వె. అఖిల దోషములకు నాదికారణ మును

నపయ శంబునకునిఁ జాలయుంబు
నైనలోభమాత్మ్నఁ నంగీక రించుట
నియతమ తులకెల్లఁ నీతి గాదు. ౬౧

తా. సర్వదోషములు- అపకీర్తియు లోభంబుననే జనించును. కాన నీతిమంతులు లోభంబు విడువవలయును.

క. తనమది లోభము విడువక
యనఘుఁడ యోగీశ్వరుండఁ నత్యంతతపో
ధనుఁడ సదాచార పరుఁడ
నను నెవ్వఁడు వానిమాటఁ లవిప్రలబ్ధములే ౬౨

తా. ఎవఁడు లోభమును వదలక నేనేయోగీశ్వరుఁడను- సదాచార పరుడను- తపోనిష్ఠాగరిష్ఠుఁడననియుఁ బలుకునో, అట్టి వానిమాట విశ్వసింప దగినదికాదు. వానిమాట లన్నియు నసత్యములేయని నమ్మవలయును.

సీ. ఘనతరంబగు లోభఁ మునఁ గూడఁ బెట్టిన.
ధనమెల్ల విషసమంఁ బనియులోభ
విరహిత స్థితిగలఁ విదిత శాకాహార
మైనను నమృతోపఁ హారమనియు
దెలసిలోభ గుణంబుఁ తెంపుమై విడిచినఁ
బెంపుచాలను గల్గిఁ పృథులదాన
భోగవిహార సంఁపూర్ణ స్వభావుని
శివపూజ నాసక్తఁ చిత్తులగుచు
తే. గీ. శివపురాణ శివస్తుతిఁ శివకథావి
నోదములఁ బ్రొద్దుపుచ్చు చుంఁ డుదురు శైవ
పరులు శివయోగ చిదమృతఁ వార్ధినోల
లాడుచును శివుఁడక్కునఁ న్యంబులుడిగి. ౬౩

తా. శివయోగులు లోభమున నార్జించిన ధనమంతయు విషంబని తలంచి- లోభము లేకుండ నార్జించిన ధనము నమృతోపహారంబని తలంచి దానంబు లొనరించుచు

భోగంబులను భవించుచు- శివపూజ నాచరించుచు- శివకథల వినుచు- శివభజన సేయుచు- కాలము వెళ్లించెదరు.

క. చంచలములు ప్రాణములగి
చంచలములు సిరులుమిగులఁ జంచలములు భా
వించఁగ బాయము లగుటయు
నించుకయును లోభమొలవ దెయ్యెడనైనన్. ౬౪

తా. ప్రాణములే చంచలములు వానికంటె సంపదలు చంచలములు- వానికంటె యౌవనములు చంచలములు. కాబట్టిసజ్జనులీరహస్యము దెలిసికొని లోభమును వదల వలయును.

సీ. వేయును నేటికి విలయాగ్ని చేత న
గాధంబులైనవి యోఘుచేడు
నమృతాశ నావాస మగుమేరు మందర
హిమవత్ప్రముఖ శైల సముదయమును
గూడంగ నేఁబదికోటుల యోజనం
బులుగల ధారుణి తలము నిముష
మాత్రంబు లోననె మాయమై యాయన రజః
పటలమై పరమాణు భాతినుండు
గీ. నవలి యంబరమును నిట్లె యంబరంబు
తక్క దక్కిన సకలభూతములు నంద
యడగు నెఱిఁగియు నింకనిత్యమని యేప
దార్థ మాశించి విడువలే రకట నరులు. ౬౫

తా. అక్కటా! బడబాగ్ని సహితములై యతిగంభీరములగు సప్తసముద్రములు- దేవతల కావాసములగు మేరుమందర హిమవత్పర్వతంబులు, ఏబదికోట్లు యోజనములు గలయీభూమియంతయు, క్షణకాలములో పరమాణువులవలెనెగసి యాకాశమున విలీన మగుట నెఱింగియు, ఏపదార్థము నిత్యమని భావించి జనులు లోభగుణమును విడువరో గదా?

వ. కావున. ౬౬

తా. కాబట్టి.

క. కనుఁగొనఁగ జగంబంతయు
ననిత్యమని మదిదలంచు నటివో లోభం
బును వగతు సంహరించెను
ననుపని యెఱుఁగంగ వలయు నచలిత బుద్ధిన్. ౭౭

తా. జగంబంతయును నిత్యంబని మనంబునకు దోచి నచో, లోభంబుండ నేరదు.

— * మోహస్వరూపము. * —

సీ. మోహాంధకారంబు ముక్తిత్రోవకు మఱుఁ
గైయుండు నని చెప్పి రాదిమునులు
మోహంబు సాహసంబున విడిచిన యుత్త
ములు దుర్భవాంబుధి వలను జొరరు.
మాఁతలు పుత్రులు బంధులు మిత్రులు
పశువులు మొదలైన బహుధనములు
వనయంబుఁ గూరిమి జనియించ నవిఘటి
యింపంగ నవి చెను నెడలమనను.

తే. గీ. లంపునుడుగని దుఃఖాగ్ని యందు నుసుకఁ
జేయు నుమతర పుణ్యులఁ జేరి మోహ
మదియ కాదె యోగీంద్రుల నైనఁ జెఱచు
మర్త్యులెంత సంసారగంబు మరిగి నేని. ౭౮

తా. మోహపిశాచ గ్రస్తులగు మానవులకు ముక్తి మార్గము దొరుకదు. మోహంబు విడిచిన వారికి సంసార భయం బణుమాత్రము పొంద నవసరము లేదు. స్త్రీలు—కొమతులు బంధువులు— మిత్రులును— పశువులు— ధనము గృహము మొదలగు వాటి యందు కూరిమి గల్గుటయు— ఇందు నేదేని పోయి నపుడు మహాదుఃఖమునను భవించుటయు— మోహమని చెప్పఁ బడును. ఎంతటి మునీంద్రుల నైనను, నీ మోహము లెనపలలోఁ బడవేసికొనుచుండ మానవుల విషయమై చెప్పనేల?

క. అమ్మోహము సంగతి నిము

న స్మైనను నిలిచియున్న జనునకుఁ గడుదో
షమ్మగు నంట తానని వా
సమ్మంట మోహంబు సకల సంసారులకున్. ౬౯

తా. ఆమోహము నియమ మాత్రమునుండినను మహాదోషము సంభవించునుగాన సంసారులకు మోహము మహా సంకటము.

చ. ఉడుగక మోహముల్లమున నున్నకతంబున నేకతంబునన్
మృడు మదినిల్పి మర్త్యులును మెచ్చఁగ గొల్వఁగ లేరు సత్యముం
గడునియమంబులున్ విహిత కర్మములుం దుదిమోక్షలక్ష్మియుం
జెడు భవపాశ బంధముల జిక్కులు వీడవు మోహ సంగతిన్.

తా. మోహము వదలక యుండినచో, రహస్యస్థలంబున గూర్చుండి మనమ్మనస్సునిల్పి యీశ్వరుని గొల్వఁ జాలఁడు. అతిడు నియమంబులు, సత్కర్మములు, పరిపాలింపకఁ బోఁగా సంసార పాశాబంధితుఁడై మోక్షలక్ష్మి నిగ్రహింపఁ జాలఁడు.

వ. మఱియు నత్యంత భక్తిపూర్వకంబుగా నిరంతరంబును హృదయ
వాక్య ధన తను శుశ్రూషలునాలుగింటను గురువులం గొలువని
దియును, శైవాగమోక్త్ర గోక్త మార్గంబున నఖిల సుర ముని నిక
రావ తరణ సమన్విత శివ లింగార్చనా విశేష కృత్యంబులఁ బర
మాను మోదంబుల దినములు గడపనిది యును, వైదికాచారప
రాయణులై శివుఁడక్క నన్యం బెఱుఁగక రాగద్వేష విరక్తులును,
గురులింగ జంగమ భక్తియుక్తులును భవముక్తులు నతి పవిత్రులు
నైన మహాభక్తవరుల నింటికిఁ దెచ్చి యుచితక్రమంబున బూజిం
చి యలరింపం జేయ నిదియును, శివోదితంబైన యోగంబవలంబిం
చిమహాను భావులైన శైవుల దర్శించుటకై వారలున్న యెడలకు
జన నిదియును, మనోవాక్కాయ కరణంబుల నచలితంబులైన త
పంబులు గైకొననిదియును, సన్మార్గ వర్తులయిన పెద్దల బోధఁగని
దయాభరిత భావంబునఁ బ్రోవ నిదియును శివయోగీంద్రుల వల
న యోగ రహస్యంబులు వినవలయునన్న విమల బుద్ధిజనిం పనిదియు

ను, సరసగతి నతిచతుర వచన రచనల బ్రచురంబుగా గురు లింగ జంగమశివభక్తుల నభినుతించెడు గుణంబుఁ బ్రాపింపఁగలుగని దియును నశ్రౌత పాషండ శాక్తాది నానావిధ కుమతవర్తనుల యిన దురాత్ములఁ బరిత్యజింప నిదియును శివధర్మ తత్పరులై శిష్ట జనంబులైన శివ యోగీంద్రులఁ జేరిభజింప నిదియును శివమహిమంబులు సెప్ప బహుపురాణ కథాసుధారసంబు కర్ణపుటంబులఁ గ్రోల నిదియును శివయోగ జ్ఞాన జనితాభ్యంతర నిరంతరని తాంతసుఖాను భవంబున నస్పందిత నిరుప మానందంబునం బొందని దియును మోహంబని చెప్పం బడును. ఇవ్విధంబున మానవుల కైవల్యమార్గం జేయుచు జన్మజరామరణ స్వర్గనరక ప్రముఖ నిఖిల దుఃఖాకర నిస్సార సంసార వ్యాపారంబుల వలన నతివ్యాకుల హృదయులంగా నొనరించు నదియుంగాక.

తా. గురువులకు, మహాభక్తితో చతుర్విధ శుశ్రూషలు చేయవలయును. శివాగమోక్తరీతులందు జెప్పినవిధంబున శివలింగార్చన మాచరింప వలయును. శివుదప్పనన్యులగొలువక రాగద్వేష రహితులు గురులింగ జంగమభక్తి యుక్తులు మహాభక్తులనగు సారాధ్య శిఖామణుల నింటికిదెచ్చి పూజించవలయును శివయోగాభ్యాసులైన మహాత్ములున్న యెడకు జనవలయును. త్రికరణశుద్ధిగా దపంబాచరింపవలయును. సత్పురుషులగు పెద్దలదయాపాంగ ప్రసారంబులఁ జూడవలెను. యోగ రహస్యంబుల శివయోగులవద్దకేగి వినవలెను. గురులింగజంగమ భక్తుల సంతోషమున నుతించవలెను. పాషండమతస్థుల త్యజించి శివధర్మ పరులగు శివయోగీంద్రుల గొలువవలెను. శివమహిమా ప్రతిపాదితంబులైన శివపురాణంబులనాలకించవలెను. శివయోగ జ్ఞానంబున నాభ్యంతరపూజనం బాచరించి సదానందంబను భవింపవలెను. ఇవియన్నియు చేయక పోవుటమోహంబునుబొందుటయని వచింపబడును, జన్మజరా మరణ స్వర్గనరక దుఃఖాదుల ననుభవింప జేయుచు కైవల్య దూరుగా జేయునది యీ మోహమే సుమీ?

క. విలసిత సద్గుణ నివహం
బలలోపల మోహవశునకేటికి నింపొం
దలపోయ నూఁకఁబందికి

మలయజ పంకంబుఁ గోరశ్ మదికింపగునే. ౭౨

తా. మోహవశుఁడైన వానికి సద్గుణములు రుచింప నేరవు. పంది బురద మెచ్చునుగాని, పన్నీరు మెచ్చునా?

మ. వనితల్ దుర్మలభాండముల్ ధనముసర్వంబుల్ ఘనంబైనదుః
ఖ నిదానంబు సుతుల్ దురాత్ములయినంశ్ గష్టంబుగా నన్వయం
బునకుల్ దుర్గతిఁబొందఁజేయుదురుదుశ్ రోమ్మాహాత్మ్యఁడీచందముల్
గనియుఁల్ వేడ్కఁ దదీషణత్రితయ కాంశ్ బొంబుద్ధియాటేలకో?

తా. వనితలా! దుర్మలముల కాకరములు- గుత్సేప్సలకు- దుర్బోధలకు నిలయములు. ధనమా! సకలదుఃఖములకు నిలయము. సుతులా! దురాత్ములయినచో వంశమునకుఁగళంక మాపాదింతురు. ఈవిషయము లన్నియుఁ జూచుచునే మోహవశులై మానవులు ఈషణత్రయము మంద పేక్ష వహించుట యెందుకో దెలియదు.

క. ధర్మవిరుద్ధ పథంబులు
దుర్మతులై చూపుచుండుదురుశ్ బాంధవులుల్
దుర్మిత్రులు వారలయెడఁ
గూర్మిపొడము మోహియైనశ్ కుమతికి నెపుడుల్. ౭౪

తా. బాంధవులును- దుష్టబుద్ధిగలవారైయధర్మమార్గములనే బోధింతురు. మోహవశుడగు వానికి దుర్మార్గుల యందె కూర్మిగలుగు చుండును.

ఉ. ఎట్టిపదార్థమై నభుజిశ్ యుంచిన యప్పుడు దుర్మలంబ యౌ
నట్టి పదార్థ సంచయము నంశ్దనురక్తి వహించుఁ బాపముల్
చుట్టిన రాజ్యసంపదలుశ్ సొంపులు గైకొనఁ గోరుచుండునే
పట్టున మోహయుక్తుఁడగుశ్ బాలిశుఁడెంతయు మోహచిత్తుఁడై

తా. ఎంతటివిలువగలపదార్థమైనను-ఎంతటిరుచిగలపదార్థమైనను తినిన వెంటనేమలస్వరూపమునొందునుగదా! అట్టిపదార్థము నందను రాగమువహించుటయు- పాపసంకులమగు రాజ్యసంపదల కాశించుటయు మోహయుక్తుడగు బాలిశుని కృత్యములు.

తే. గీ. మెఱుఁగులను బోలె నిలుకడశ్ నెఱుఁగలేక

మిథ్యలగు దుర్భవస్త్రీలఁ మెచ్చియనుభ
వింపుచుఁగు మోహవశులై వివేకహీను
లగుచుఁ బరలోకచింత సేయంగ మఱచి. ౭౬

తా. పరలోక విచారమను మాత్రమునులేక వివేకములేక మెఱుపువలె క్షణకాల ము కన్నులకు మిఱుమిట్లు గొల్పుకాంతామణుల మోహించి జనులునశించు చున్నారు.

క. మోహంబను శత్రుఁడువిధ
మూహింపఁగ దొడ్డగాడె యొక్కొఁకయెడఁ దా
నో హా! తజ్జులనైనఁ
సాహసమున ముసుగ ద్రోయుఁ సంసారాబ్ధిన్. ౭౭

తా. శత్రువు లందరిలో మోహంబను శత్రువు మహాబలశాలి. ఆత డెంతటి పండి తుని నైనను సంసార సాగరమునఁ బైకితేలకుండ జుట్టుపట్టి ముంచు చుండును.

మాలినీవృత్తం. తెరువరు లొకచోటం దెల్లఁగాఁగూడి యన్యో
పురములకు యథేచ్ఛం బోవుచుందంబు దోఁపం
బరువడి నెపుడున్ బాంధవ్యాధు సంఘంబు గూడన్
విరియఁగఁ గనిమోహంబేశతం బొందనేలా. ౭౮

తా. బాటసారు లందరొక్కచోఁ గూడి తెల్లవారి జామునసే లేచియెవరి పను లకు వారెటుల బోవుచుందురో, అటులే బంధువు లందరు- ధనమున్నంతవఱకో, లేకబం ధుత్వ మున్నంతవఱకో, తన్నాశ్రయించి యుందురు. గానవీమాత్రమునకై ప్రేమ వహింప నేల?

క్రౌంచపద వృత్తం. గ్రాహక బుద్ధిన్ నోహము నొందం
గనపును బుడుకయొక కగిరిసమంబై
దేహము నెల్లన్ దాహము సేయం
దెరువగు ననిమడిన్ దెలిసి సముద్యా
త్సాహస వృత్తిన్ మోహము వీడన్
జగతి గిరియుఁ ద్యాణిన్ సద్భోతిగంబౌ

నైహిక సౌఖ్యోక్ తాన్పహ మమరమో
హాముపిడ దగుఁ బరక్ మఖిమత మైనన్. ౭౯

తా. ఐహిక సౌఖ్యము వదిలి పరసౌఖ్య మందిష్టము గలవాఁడై మోహామువదలినే నిఁ బర్వత మయిన మద్నణ సమానం బగును. పరసౌఖ్యము వదిలి యైహిక సుఖ మాశించి మోహ జాలమున బడినవానికి దృణమైనను బర్వత సమానముగ్గా గన్పించును.

క. వృక్షమున రాత్రి బహువిధ
పక్షులు వసియించి తెల్లక్ వాఱంగ యథా
పేక్షలఁ జనుగతి బాధవు
లక్షయముగఁ గూడివత్తుర్ రన్యోన్య యెడలన్. ౮౦

తా. రాత్రియందుఁబిట్టలన్నియుఁ జెట్టుమీదఁజేరి తెల్లవారగనే పోవువిధమున—గళత్రపుత్రాది బంధువులా యాసమ యముల ననుసరించి చేరుదురు. గాన వారియందు మోహము పెట్టికొనుట వట్టిభ్రాంతిచేయుటా?

క. జనులు దెలియవలదె మహాం
బునిధిం గాష్ఠములు గొన్నిక్ పొదవికొని వడిం
జనుదెంచి యెడనెడన్ వి
చ్చిన యట్టుల కాదె సకలక్ సృష్టియు నరయన్, ౮౧

తా. ఈప్రపంచ మందలి సృష్టియంతయు— మహాసముద్రమువపయిచుండికొట్టుకొని వచ్చిమధ్యనొక చోటఁ గలసి మరల విడిపోవుకట్టెలవిధముగనున్నది గదా? దీనిజూచి మోహము నొందనేల?

ఉ. తప్పక సర్వబాంధవ విక్ తానము బుత్రులు నిష్టభృత్యులున్
జెప్పగఁ నున్న వారనుచుఁక్ జిత్తములో నలరున్ జనుండు వా
రొప్పున మోహరజ్జుల నక్ నుద్ధతిఁ గట్టుచు ధర్మమోలఁ ద
న్నొప్పన సేయనున్న కడుక్ నుగ్రపు దాయలుగారె యారయన్.

తా. పుత్రులు- మిత్రులు- భృత్యులు— మొదలగు బాంధవు లందఱు తన్నుసుగతికి బంపించునని మానవులు తలంతురు గాని, మోహపాశముల బంధించి యమునిసన్నిధికి గొనిపోవుదురని తలంపనేరరు గదా?.

వ. కావున. ౧౩

తా. కాఁబట్టి.

క. పుత్రులపై మిత్రులపై
గోత్రులపై నింతయొ మోహగుణము నిలిపినన్
సూత్రగతి వదిమెనరునకుఁ
జిత్రముగా బాధనంబుల సేయంజాలున్. ౧౪

తా. పుత్రుల మీదగాని, మిత్రుల మీదగాని, సగోత్రుల మీదగాని, మోహమే మాత్రముంచిన మనది బంధమునే గలుగజేయును గాని ముక్తి గలుగఁ జేయదు.

తే. గీ. మోహ నిర్మోహములు బంధ ముక్తి కార
ణంబులగుటను మోహ గుణంబు ధైర్య
ముద్రయను కత్తితోఁ గోసి మోక్ష సుఖముఁ
జూఱగొనవచ్చు వెససిది సులభ మతము. ౧౫

తా. బంధ ముక్తులకు గారణము మోహనిర్మోహములు- కాన ధైర్యమను కత్తితో మోహలతను నరికివేయ వలయును. ఇటుల మోహము జయించి కాని మానవులు ముక్తినొంద జాలరు.

—— మదలక్షణము. ——

చ. సకల కలాకలాప సువి చారదుఁడై సమదాంధుఁ డయ్యెనే
నొక యెడనైన మంచి గుణ ముల్లమునంజొర నీకసత్క్రియల్
వికలతఁ బొందఁ జాలన వివేకియగున్ శివునాత్మలో నెఱుం
గక భవబద్ధుఁడౌచు నప కారము సేయును సజ్జనాళికిన్ ౧౬

తా. సకల శాస్త్రంబులు నేర్చిన మంచివిద్వాంసుఁడైనను మదాంధుఁడైనచోఁ నవివేకియగును. అతనికి మంచి గుణ మొకటియు పట్టుపడదు. శివస్మరణము సేయకయాతఁడు సంసార కూపమునఁబడి సజ్జనుల కపకారము సేయుచుండును.

క. విజిత ముగ నస్థిరపు సం
పదలు నిజములనుచు నుబ్బి ప్రల్లదుఁడై దు

ర్మదుఁడైన చెనఁటి మనుజుం
డె దురెఱుఁగక విఱ్ఱవీఁగు ॥ నిమ్మహిలోనన్. ౮౮

తా. అస్థిరములైన సంపదలను స్థిరమని నమ్మి మదాంధుడు తనకెదు రెవరు లేరని విఱ్ఱవీగు చుండును.

చ. సిరిక్రియ గాలిచందమున ॥ శీతమయూఖుని భాతివిద్యుదు
త్కరము తెఱంగు నంది వియ ॥ త్తైవడి నంబుధ రాలిచాడ్పునం
తరుణుల మానసంబుల ప ॥ థంబున వార్ధితరంగ భంగిన
స్థిరములు దేహముల్ మద వి ॥ జృంభితు లౌదురు మర్త్యులేలకో.

తా. సంపదలు- వాయువు- చంద్రుఁడు- మెఱపులు- దీపములు- మేఘములు- తరుణుల మానసములు- తరంగములు- క్షణభంగురములై నట్టుల దేహములు క్షణభంగురములు గదా?. ఈవిషయమును దెలిసియు మదంబున కన్నుమిన్నుగానక కొందఱు చరించుట కేమి కారణమో గదా!

శా. దేహం బస్థిరమంట గన్గొనిమదో ॥ ద్రేకంబునం బొందకా
దేహంబు న్మనము న్ధనంబు నతిభ ॥ క్తిన్ సద్గురు స్వామికి
న్నిర్వారాత్రి సుతామనో హరునకు ॥ న్నిత్యంబు తద్భక్తియు
క్తా హీనాత్ములకు న్వివేకులగు వా ॥ రర్పింతు రెల్లప్పుడున్. ౮౯

తా. వివేకులు దేహమస్థిరమని తలంచి మదోద్రేకము నొందక మహావినయముతో మహాభక్తితో గురుచరేశ్వరులకు తనువునో ధనముల నిత్యమునర్పించి సేవించు చుందురు

క. కులశీల రూప విద్యా
బలధనముల వలన మదము ప్రభవిలు నదియుం
గులశీల రూప విద్యా
బల ధనవంతులనుఁ గనినఁ బాయదె జగతిన్. ౯౦

తా. కులమునత్ప్రవర్తనము- ధనము- రూపము- విద్యయు బలమును మానవులకు మదమును బుట్టించును. గానికులశీల రూపధన వంతులగు వారెంతటి దుస్థితి ననుభవించు చున్నారో, యొకసారి పరికించినచో నీధరిత్రియందే మానవుండు మదంబును బరిత్యజింపడు.

క. కులము గలవారెచట ము
క్తులైరి కులహీను లెల్లఁ గుదిరి నెచటను ము
క్తులు గారె యోగిజనులే
కులజులుగాకితరు లేటఁ గులజులు దలఁపన్. ౯౧

తా. సత్కులంబున జన్మించిన వారిలోఁ (జాలమంది) దుష్కార్యము లాచరించి నరకము చెందిన వారే గాని, ముక్తి నొందిన వారరుదు. కులవిచారమును వదలి పరమాత్మ నుపాసించియే యనేకులు ముక్తి నొందిరి. నిజము విచారింపఁగా యోగిజనులే కులీనులుగ్గాని యితరుల కులీనులని చెప్పఁదగునా?

ఆ. వె. నిగమ విహిత శీలు నిష్ఠఁ దూర్ధ్వగతికి
నేగు శ్రుతివిరుద్ధు మింతయైన
నధమ గతికి నేఁగు నజ్ఞాట నంత సు
శీల వృత్తి ముక్తిఁ జెందు మతము. ౯౨

తా. వేదానుకూల విధంబున నాచరించిన (వా)రూర్ధ్వ గతికేగుటలోఁ సంశయము లేదు. వేదవిరుద్ధముగ కొంచము ప్రవర్తించినను వాఁడధో గతికే పోవును. కావున సుశీల వృత్తియే యనఁగ సత్ప్రవర్తనయే ముక్తికి మార్గము.

క. మనసిజుని కంటె రూపం
బున నధికులు గలరె యతఁడుఁ బురహరు చేతం
గనుమాయన డఁగి పోయె న
నినఁ దక్కిన రూపు లెవ్వి నిత్యము లరయన్. ౯౩

తా. ఆహా! త్రిలోకంబు లందైనను మన్మథుని కంటె మించిన సౌందర్యశాలి లేఁడుగదా! అట్టి మన్మథుఁడు సయితము మహేశ్వరునిచే భస్మమై చేయబడెను. ఇఁక నెవ్వఁడీ రూపంబును నిత్యమని నమ్మినదంబుఁ జెందును?.

క. మునుకొని కల్పాంతము దాఁ
క నభ్యసించినఁ జదువులకు కడ యెన్నఁడు లే
దనినను విద్యార్థికులిం
క నెవ్వరైనను ధరిత్రిలోఁ గనుఁగొనఁ గలరే. ౯౪

తా. కల్పాంతము వఱకు జనువు కొనినను, జనువున కంతము లేదనిరి గాన సర్వవి ద్యాధికుని నొక్కని నైనను వేలుపుదని చూపించ గలరా? కావున విద్యను జూచికొని గర్వించుట తగదు.

తే. గీ. రజతగిరి లీలనెత్తిన రావణుండు
వానిఁదన తోఁకఁ గట్టిన వాలియును న
తని నొకమ్మునఁ దునిమిన దాశరథియు
బలిమిఁవైని నిల్చిరే ధరావల యమునను. ౯౫

తా. వెండికొండను నవలీలగా నెత్తిన రావణాసురుఁడును, వానిని తనతోకతో జుట్టి వేసిన వాలియును, అతనినొక బాణముచే (బడగొట్టిన రాముండును, జని పోయి నారనిన నిక యీధరిత్రి యందెవ్వడు బలమును జూచికొని గర్వించును.

క. క్రమమున మును నృప వరుల
ధనము లెంతయుఁ గూర్చిరందుఁ దారంబైనం
దమతోడం గొనిపోయిరె
యమర్త్య భువనంబునకు రవి యంబారంగన్. ౯౬

తా. తొల్లి రాజాధిరాజు లెందఱో ధనము నార్జించి ధరాపల యందున విడిచి చనిరిగాని, వారిలో నొక రైనను వెంట మూట గట్టికొని పోయిరే? కావునధనంబుఁజూచి, యేమూఢుఁడు మదంబు వహించును?.

క. ఊహించి యట్లగుటను గ
తాహంకృతి నుండవలయు నవఘాత్ములు సం
దేహము వలదది మదజల
వాహాపటలమునకు గంధ వాహం బెపుడున్. ౯౭

తా. జ్ఞానులీరీతిగా నూహించి యహంకారమును వదిలి నిస్సందేహముగా నుండ వలయును.మద మేఘమునకు నిటుల విచారించుట ఝంఝూమారుతము వంటిది.

—*మాత్సర్య లక్షణము.*—

శా. మాత్సర్యంబున బుఁగుఁడై తిరుగు దుర్గాత్ముఁడు వర్జించు వి

ద్వత్సంగంబు సమస్తదుర్గుణ నిజావాసంబగుట దాన ను
ద్వత్సంసార మహాటవీ పటుతర వ్యాపార నిర్ఘాత సం
విత్సాఖ్య స్థితి శైవధర్మమునకున్ స్వావేగ దూరుండగున్.

తా. మాత్సర్యముతో గూడికొని మానవులు విద్వత్సహవాసమును వదిలి దుర్మార్గులై చరించు చుందురు. దాని వలన సంసార లంపటులై దుర్వృత్తులకు లోబడి శైవధర్మములను బరిత్యజించి నరకంబున కేగుచుందురు కాన మాత్సర్యంబు విడువ వలయును.

సీ. విద్యాధికులమని ♦ విఱ్ఱవీఁగెడువారు
మిక్కిలి ధనికులై ♦ మెఱయువారుఁ
బ్రకటితైశ్వర్య సం♦ పదలఁ బొందెడు వారు
నిజకీర్తి దిశలనిం♦డించువారు
నిబిడంపుఁ బ్రజకల్మిఁ♦ బ్రబలుచుండెడు వారు
నెరయ దుర్జనగోష్ఠి♦ నిక్కువారు
రూపరేఖా వయో♦ రూఢిఁ గ్రాలెడు వారుఁ
గులశీలములు గ్రాలి♦ చెలఁగువారు

తే. గీ. వీరువారననేల దు♦ర్వారగర్వ
భరితబహువిధ సంసార♦ నిరతులెల్ల
నొక్కొకరి కంటె నధికులై ♦ యుండనుత్స
హింతు రెంతయు మత్సరా♦ క్రాంతు లగుచు. ౯౯

తా. విద్యావంతు లొకరిని మించి యొకరుండ వలయునని, పరస్పరము మాత్సర్యముచేతనే ప్రయత్నించు చుందురు. ధనవంతు లొకరిని మించి యొక రుండవలయు నని ప్రయత్నించుటకు నిదియే కారణము. భోగవంతులు, యశోవంతులు, సంతానవంతులు, దుర్జన సహవాస ధురంధరులు, రూప వయస్సంపన్నులు, కులశీల సంయుతులు, వీరు వారననేల? మహాగర్వ సమేతులై సంసార రక్తులై యొకరిని నొకరతిశయించి యుండ వలయునని యందఱునిత్యము ప్రయత్నించుటకీ మత్సరమే కారణము.

క. ఒకకొందఱు మత్సరమున
నెకవెక్కెచుఁ గ్రిందుమీదు♦ నెఱుఁగక దుష్టా

శ్వరులై తెలియఁగ నేరరు
సకలంబును నీశ్వరాజ్ఞఁ జనియించుటఁగన్. ౧౦౦

తా. లోకంబునఁ గొందఱవివేకులు మత్సరమున నీసమస్తము నీశ్వరాజ్ఞచేలన జరుగుచున్నదని తెలియ లేరు.

క. ధూర్తుల సంగతిఁ బాయక
వర్తించు దురాత్ములైన వారలు వోదు
ష్కీర్తి యుతులైన మత్సర
మూర్ఖులు వారలకు భుక్తి ముక్తులు గలవే. ౧౦౧

తా. ధూర్తుల సహవాసమొనర్చుచు మంచిచెడ్డల గుర్తెరుగక యసూయాపరులై యపకీర్తి కైనను దలయొగ్గి సంచరించు దురాత్ములకు భుక్తిముక్తులు సంభవించుట దుర్లభము.

సీ. క్షణభంగుర ప్రశస్తములు జవ్వనములు
సరసిజ దళబిందు తరళ దములు
కరికర్ణ చపలముల్ కాయంబులన్నియు
విదితవైభవము బుద్బుదసమంబు
పుత్రదారాదులు దృష్ట మాయ రూపులు
మిత్ర బాంధవకోటి మెఱుఁగు లట్లు
బహురూప ఘటనా ప్రపంచమీ సర్వంబు
స్వప్నవిధము జగజ్జాలమెల్ల
తే. గీ. నింద్రజాలోప మాన మూహించిచూడ
నింతయును నని మదిలోన నెఱుఁగలేరు
కుమతులగువారు మత్సర భ్రమితులగుచు
వారలకు సగమ్యంబు కైవల్య పదము. ౧౦౨

తా. అయ్యో! లోకులీ మాత్సర్యమునఁ జెడి పోవుచున్నారు. కాని సత్యమువిచారింపరైరి. అహా! యౌవనమా? క్షణభంగురము. తామర బిందువువలె చంచలమైనది. శరీరములా? ఏనుఁగ చెవులవలె నతిచంచలములు. వైభవములా? నీటిబుగ్గలవంటివి. దారాపు

త్రాతులా? యశాశ్వతులు. మిత్రబాంధవులా! మెఱుపు వంటివారు. అనేక రూపంబుల భాసిల్లు నీప్రపంచంబంతయు- విచారింపఁగా స్వప్నసదృశము. ఈప్రపంచమును నింద్రజాలోపమానముగఁ గాంచనేరక మత్సరగ్రస్తులై మెలంగు కుమతులకు కైవల్యపదము లభింపదు. కావున మాత్సర్యంబు విడువవలయును.

వ. మత్సర మనసన్య శుభ ద్వేషంబు. ౧౦౩

తా. మత్సరమనఁగా- ఇతరుల మేలుచూచి యోర్వఁజాలకుండుటయే.

క. మత్సర రహితుల కనవర
తోత్సాహాన్వితుల కతుల యోగజనిత సం
విత్సుఖ పరవశ మతులకు
వత్సలుఁడై యుండు శివుఁడు వరదుండగుచున్. ౧౦౪

తా. మత్సరమువిడిచి యోగము నవలంబించి యా యోగమువలన జనించు నానందరసము గ్రోలుచుం గాలంబుగడుపు మహాత్ములకు శివుండు తోడునీడైయుండును.

క. రభసమునకు జనసంగతి
ప్రభవించుచు నుండు మత్సరము దీనన కా
దె భవభయం బెదనుడుగక
యుభయ గతులఁబొంద లేక యుండుదు రధముల్. ౧౦౫

తా. సంతోషమున జనులితరుల గొప్పచేయు చుందురు. దానినాలకించి కొందఱుతమను గొప్పచేయలేదను నసూయనుబొంది దుష్కార్యము లాచరించి సంసారమునుండి తరించ లేకయు- ఇహలోక సుఖమునకు- పరలోక సుఖమునకు దూరులగుచున్నారు

క. తగులున్ సంసర్గన దో
ష గుణంబులు పుణ్యములు నిజంబుగ ననుచున్
నిగమార్థంబులు ప్రోయుట
దగునె దురాత్ములకు గోడి తగులెవ్వరికిన్. ౧౦౬

తా. సత్సహవాసమున సద్గుణంబులును- దుస్సహవాసము నదుర్గుణంబులును సంభవించునని వేదంబులు మ్రోగుచున్నవిగదా!. కావున దురాత్ముల తోడిస్నేహంబొనర్చుట కంటెఁ బాపకృత్యము వేరొకటిలేదు.

క. ధరలోనఁ జంద్రకాంతపు

గిరిపొంతను దర్పణంబు ద్రేవఁగనుఁగొనన్
గిరికరి కరిగిరియెట్లగు
సరిసద సద్భజన మిట్టి చందమె కాదే. ౧౦౭

తా. చంద్రకాంతపు పర్వతమునందుగాని, దర్పణమునందు గాని- పర్వతము ప్రతిఫలించినచో ఏనుగు గాని? ఏనుగు-ప్రతిఫలించినచో పర్వతము గాని, కావటుల సత్పురుష సహవాసమున దుర్జనులు గాని, దుర్జన సహవాసమున సత్పురుషులు గాని, కాజాలరు.

ఉ. ఎత్తెరి నెట్టివారి భజి యించిన నట్టిఁడయై చరించు న
త్యుత్తముఁడైన నెట్లనిన నోలినవజ్ఞత నొందునైనఁ దా
హత్తుచుఁ దత్తదాకృతి య యాశశికాంతపు భాతిగావునం
జిత్తమెలర్ప నుత్తములఁ జెందుచుమానవుఁడట్లకాఁదగున్. ౧౦౮

తా. ఉత్తముల సేవించిన వారికి నుత్తమబుద్ధి లభ్యమగును. అధముల భజించిన వారికి నధమబుద్ధి జనించును. చంద్రకాంతమణి యందుఁ దనయాకార మెటులనుండిన నటులే ప్రతిఫలించి నటుల సదసత్పురుష సహవాసమున వారివారి గుణంబులు పట్టుబడును. కావున నుత్తముల సహవాసమే మంచిది ఎవరిని సేవించిన వారిబుద్ధియు గుణములు సంభవించును.

క. "త్యజదుర్జన సాంగత్యం
భజసాధు సమాగమ"మను భాషాగతుల
కృ-జముగఁ జదువఁగ వినరే
యజస్రమును మనుజులిది యర్థంబ కదా. ౧౦౯

తా. దుర్జన సాంగత్యము వదలుమనియు- సజ్జన సాంగత్యము చేయుమనియు- శాస్త్రములు వచించు మాటలు వినలేదా?

వ. కావున. ౧౧౦

తా. కాఁబట్టి.

క. అత్యంత సత్త్వగుణ సాం
గత్యంబున సాధుసేవ గలిగినఁ గాలుం
గృత్యము లెవ్వియు నేటికిఁ
బ్రత్యయముగ దీనమత్సరం బెడబాయున్.

తా. సత్త్వగుణమువలన సాధు సంసేవలభించి దానివలన మత్సరము నశించును. ఇతర ప్రయత్నములకంటె సాధుసంసేవనకై ప్రయత్నించుటయే శ్రేష్ఠము.

క. ఈగతి నంతశ్శత్రుల
వేగమె నిర్జించి మదివివేకము మైన
ద్యోగాభ్యాస మునకు ను
ద్యోగము సేయంగవలయు నుడుగక యెపుడున్. ౧౧౨

తా. ఈరీతిగ నంతశ్శత్రువులగు కామక్రోధాదుల జయించి వివేకవంతుండై యోగాభ్యాసమునకును బ్రయత్నము సేయవలయును.

క. ఆలస్యంబున నూరక
కాలముపుచ్చంగ నెపుడు గవియునో మృత్యు
వ్యాళంబని తెలిసిబుధులు
కాలము శివయోగ నిష్ఠ గడపంగ వలయున్. ౧౧౩

తా. ముందు యోగమభ్యసింపఁ గూడదా? తొందరేమియని తలంచ గూడదు. "క్షణిక్షస్మిన్ హితో మృత్యుః" అను వచనము ననుసరించి మృత్యురూపమగు సర్పము వెన్నంటియే యుండును. ఈసంగతి దెలిసికొని పండితులు తమ కాలమును శివయోగ నిష్ఠయందే గడప వలయును.

క. మృత్యుసమమైన దుఃఖము
మృత్యుసమంబైన రుజయు మృత్యుసమంబౌ
నత్యంతభయము దేహికిఁ
బ్రత్యయముగ నొండుగలదె భావింపంగన్. ౧౧౪

తా. మనుష్యులకు మృత్యుసమములై నిత్యము జనించు దుఃఖరోగభయములకంటె విచారింపఁగా మఱొకటి భయంకరమైనది గలదా?

క. దారలు పుత్రులు మిత్రులు
నారాజ్యైశ్వర్యములును నాబంధములౌ
వైరగతినిది తొలఁగఁడు ఛ

తీరియుఁ దనమృత్యు వవధారించిన దాఁకన్. ౧౧౫

తా. భార్యాపుత్రులు- మిత్రులు-రాజ్యము-ఐశ్వర్యములు బంధుజనులు విషయములు, దన్ను మృత్యువునోట వేసికొను నంతవరకు జీవులు గుర్తింపజాలరు.

క. భువిలోన నెవ్వరికి మృ
త్యువు చేరువయగును వాని కూహింపంగా
వివిధమ్ములగు నరిష్టము
లవశ్యమును దోఁచు మొదల నవియెట్లనినన్. ౧౧౬

తా. లోకమునందు మృత్యువు సమీపించిన వానికి నపశకునము లనేకములగ బడును. వాటిని ప్రతిమానవుఁడు గుర్తింపవలయును.

—:అరిష్టలక్షణములు:—

సీ. దివిజపథంబున ధ్రువుని శుక్రుని శని
చ్ఛాయ నరుంధతి నతని మాన
వుఁడు గానకుండునేని వాఁడు మృత్యుసం
ప్రాప్తుఁడౌ నొక వత్సరంబు మీఁదఁ
గిరణవిహీన భాస్కరబింబమును గిర
ణావృతాగ్ని గనిన యానరునకు
మరణ మేకాదశ మాసంబు లరిగిన
నటమీఁదఁ గల్గుట తథ్యంబుగాఁగ
తే. గీ. జనుఁడు కలలోననైన దృష్టముననైన
రజతమును గాంచనమును మూత్రము పురీష
మును గరంబు తొందఁ గ్రక్కిన నతండు
నిధనమును బొందు నొకపది నెలలు చనఁగ. ౧౧౭

తా. ఆకాశమందున్న ధ్రువనక్షత్రము-శుక్రనక్షత్రము-శనినక్షత్రము- అరుంధతియును నేమానవునికి గన్పించవో, ఆఁడొక సంవత్సరము బ్రతికి తర్వాతఁ జనిపోవును. ఎవనికిన గ్నిహోత్రము కిరణములతోఁగూడి కొన్నటులను సూర్యబింబము కిరణరహితముగను గన్పించునో, అతఁడు ౧౧మాసములమీద మృతినొందును.

ఎవఁడు స్వప్నమునందు గాని, ప్రత్యక్షముగాని, బంగారము— వెండి-మూత్రము, పురీషము కక్కునో యాతఁడు పది నెలలుగడిచిన తరువాత చనిపోవును.

క. ప్రేత పిశాచ కనక వృ
క్షాతత గంధర్వపురములఁ లాలోకించుచుఁ
భూతలమున నేపురుషుం
డాతఁడు నవమాసములకు నసువులు విడుచున్. ౧౧౮

తా. ఎవఁడు, పిశాచముల, ఉన్మత్త చెట్లను గంధర్వపురములను గాంచునో, ఆతఁడు తొమ్మిదిమాసములకు చనిపోవును.

తే. గీ. అరయఁగారణ మించుకయు యయినలేక
నలము గలవాఁడు బడుగైన నలములేని
వాఁడు నలమైనఁ దెలియంగ నలయు వాని
బ్రతుకు నెనిమిది నెలలౌటు భవ్యమతులు. ౧౧౯

తా. బలముగలవాఁడు, కృశించి నటులగాని, కృశించిన వాఁడంతకంటె కృశించి నటులగాని, యాకస్మికముగ కారణములేక దోమచుండెనేని యాతఁ డెనిమిది నెలలకు మరణించును,

క. ఘన రేణు కర్దమంబుల
మునిఁగి తనదు రెండుపాదములు ఖండములై
యునికిఁ గనుఁగొన్న మర్త్యుఁడు
తేనువు విడుచు నేడు నెలలు దాఁటినమీఁదన్. ౧౨౦

తా. తానుబురదలోదిగబడినటులను, తన కాళ్లురెండును ఖండములై పడినటుల మ కలం గాంచెనేని యాతఁడేడు నెల మీద మరణించును.

క. పసిపడి గువ్వయు వాయస
మును గ్రద్దయు నాదియైన పులుఁగులు గడుగ్రో
వ్వున నడుతల వ్రేసిన న
మ్మనుజుఁడు నెలలాఱుగాని మనఁడు ధరిత్రిన్. ౧౨౧

తా. గువ్వగాని, గ్రద్దగాని, కాకిగాని, మఱియే పక్షియైనను దననడికలమీద ము
క్కుతోఁబొడిచినచో, అతఁడారుమాసములకంటె నెక్కువజీవించఁడు.

ఉత్సాహ వృత్తము

కవియుపాంసు వృష్టిచేతఁ గాకపంక్తిచేత మా
నవుని మస్తకస్థలంబుఁ దనరు దీవ్రబాధ యు
ద్భవము నొంద నైదునెలలుఁ దనువు నిశ్చయొందు లా
గవుట నాల్గునెలలునిల్గుఁ బతఁడు వేయునేటికిన్. ౧౨౨

తా. పదాగవృష్టిచేతగాని, కాకిసమూహముచేతఁగాని దనతలకు (తీవ్ర)బాధ జనించిన
చో, నాతఁడైదు నెలలకంటె నెక్కువజీవింపడు. తననీడ గన్పించకున్నను, మఱియొక లా
గు గన్పించినను, అతఁడు నాలుగు నెలలకంటె నెక్కువకాలము జీవింపఁడు,

వ. మఱియు నరుండు రెండు మూఁడు నెలలలోనఁ దెగిపోవు నపగత
మేఘంబైన యామ్యంబున మెఱుఁగును నింద్ర ధనువును నుదకం
బునుం గనినను దైలాజ్య దర్పణాభ్యంతరంబులఁ దనరూపంబు త
లలేక తోఁచినను నొక్క మాసంబున జచ్చును. నిజశరీరంబు గొ
ఱియ గదురును, శవ గంధంబును గలిగిన నర్ధమాసాయుష్యుండగు
స్నాడినపదతలంబును హృదయంబును నప్పుడఱియాడినను నీరుద్రా
వంగ నంతకంతకు దాహంబగ్గలంబైన దశదినంబుల దీఱు. కపియా
నగతుండై దక్షిణపుదిక్కునకుఁ జూడుచుం జనంగలఁగనినట్లనుంగా
క సూర్యుం డుదయంబు సేయునెడ నతండెవ్వనికైఁ నెదురుగా నరు
గు, నెవ్వనికి నతిస్థూలధ్వని సెలంగు. మిక్కిలియు నాఁకలియుఁ బొ
డమునో. ఎవ్వనికి రేయుం బగలు భోజనం బొనరించు నప్పుడ మ
నంబున నూరక భయంబు పుట్టుచుం డువాఁడును దండధరాలయం
బున కేగెడువాఁడౌట నిశ్చయంబు. ౧౨౩

తా, మఱియు నతండు రెండు మూడు నెలలలోపలనే చనిపోవచ్చును. మేఘ
ములులేక దక్షిణపు దిక్కున మెఱుపును గాని, యింద్ర ధనుస్సును గాని యుదకంబును
గాని గాంచినను— నూనె యందుఁగాని, నెయ్యియందుగాని, అద్దము నందుగాని, తన
యాకారము తలలేనిదై మొండెముగ గన్పించినను, అతఁడొకమాసములోపల (జచ్చును,

తన దేహమునందు గొప్పదైన వాసనగాని, పీనుగవాసనగాని సంభవించిన వాడెంతయు పదు
నైదు రోజులలోపల పరమగతిఁజెందును,ప్రసరించిన పదస్థానము,హృదయమునస్సు దేరయుం
డిపోయినను, తాగిన కొలది దాహ మెక్కువ యయినచో నతఁడు పదిరోజులలో మృతి
నొందును.

కోతిమీద నెక్కి దక్షిణపు దిక్కునకు ప్రయాణమై పోయినటుల నెవండు,క
లఁగనునో, సూర్యోదయమున నా సూర్యుఁడు తనకెదురుగా బోవుచున్నటుల నెవనికి
దోచునో, మిక్కిలి భయంకర ధ్వని యెవనికి వినఁబడునో రాత్రిం బవలు భోజన కాలం
బుల మనంబున నెవనికి భయంబూరక పుట్టుచుండునో, వాడు తప్పక యప్పుడే యమ నిల
యంబునకేగుట నిశ్చయంబు.

క. వెలుచఁ బలుగొలుకు నెవ్వఁడు
గలయు నెవఁడు తారకములఁ గానఁడు తనరూ
పిలలో నెవ్వఁడు వానికిఁ
గలయాయువు చెల్లుటెల్లఁగల్గ గాఁదగుఁ బ్రాజ్ఞుల్. ౧౨౮

తా. ఎవఁడు బల్లు కొలుకు చుండునో, ఎవనికను బ్రొమ్మ తిరుగుచు లోనికి పో
వుచుండునో, ఎవనికి తనరూపము గన్పింపదో, అతఁడు మరణించుట నిశ్చయము.

క. గగనమున గ్రహతారలు
పగలెవ్వఁడు గాంచు దేవపతి ధనువెవ్వం
డొగి రాత్రి చూచు నాయువు
తెగుట నిజము వారలకు నతిత్వరితముగాన్. ౧౨౯

తా. ఆకాశంబున శుక్రుఁడు బృహస్పతి మొదలగు నవగ్రహములను అనఁగా గ్ర
హసూచకములగు నక్షత్రములను, పగలెవఁడు గాంచునో, రాత్రియందింద్ర ధనస్సెవని
కిఁ గన్పించునో, అట్టి వాఁడు త్వరలో మరణించును,

చ. అనిశము వామలోచనము నంబుజలంబు స్రవించుచుండు నె
వ్వని కరయంగ ముక్కు తుద వంగుటగల్గి సికారమొందు నె
వ్వనికి ముఖంబు రక్తనిభ వర్ణము నాలుక చూడ నల్లనై
వ్వనికగు నాయువేమియును వానికిఁ లేక పోవుఁ జయ్యనన్. ౧౩౦

తా. ఎవనికి నెడమ నేత్రమునుండి కన్నీరు గారునో, ఎవని ముక్కు కొంచెము
వంగి వంకరగ గన్పించునో, ఎవని ముఖము రక్తమువలె నెఱ్ఱబడి పోవునో, ఎవని నాలుక

నల్పెక్కి పోవునో, ఆతఁడప్పుడే చనిపోవుట నిశ్చయము.

క. కలలోన నుష్ట్రరాసభ
ములఁ బూనిన రథము నెక్కి పురుషుం డెవ్వం
డల యామ్యదిసకుఁ జను న
క్కలుషంబున జీవితంబు గడచునతనికిన్. ౧౨౭

తా. స్వప్నమం దెవఁడు గాడిదల చేతగాని, ఒంటెల చేత గాని, కట్టఁ బడిన రథముసెక్కి దక్షిణ దిశకుఁ బోయి నటుల గలంగాంచునో; ఆతఁడు వెంటనే మరణించును.

క. తడఁబడఁ బ్రాతఁబడినం
గడువడిఁ దన్నెగయకుండఁ గప్పిరనుచు నే
ర్పడఁ గలగనిన మనుష్యుఁడు
తడయక జముప్రోలి కేఁగుఁ దద్దయుఁ బ్రీతిన్. ౧౨౮

తా. ఎవఁడు తడబడుచు, పాతరలోఁ బడి నటుల గాని, తానులేవకుండఁ బైన మన్నెదిచే నణచి వేసినటుల గాని, కలగాంచునో, ఆతఁడు యమ సదనమున కేఁగును.

శా. కర్ణద్వారములందుఁ బ్రేళ్లనిలుపంగా మ్రోఁత లేకుండినన్
స్వర్ణాదిత్యుని భంగి నేత్రయుగళిన్ సాకర్షణజ్యోతి స
ద్వర్ణంబై చెలువొందకున్న నరుఁడున్ దృగ్గోలతారక్తం తా
పూర్ణప్రస్ఫుర మూర్ధ్వదృష్టి యయినన్ బొందున్ మృతిక్లేశమున్

తా. తనరెండు చెవులలోఁ వ్రేళ్లఁ బెట్టి మూసికొని నప్రుడు లోపల ధ్వని లేక పోయినను, నేత్రములందు సూర్యునివలె గాంతిచక్కగా బ్రకాశింప కున్నను, కనుగుడ్లు త్రిప్పుట గల్గినను, ఊర్ధ్వదృష్టి జనించినను, దప్పక యాతఁడు మృతిఁజెందును.

తే. గీ. బొఙ్గుచోఁ దైన వదనంబుఁ బొందుదప్పి
శుష్కమైనఁ బాఁగట్టిన శుభ్రవస్త్ర
ములు దనకుఁ జూడ నెఱ్ఱనైనను నలుపు నైన
విధము దోఁచిన నరుఁడు వే వేగఁ జచ్చు. ౧౩౦

తా. తాను గట్టికొనిన తెల్లని వస్త్రము లెఱ్ఱవై దోఁచినను, నల్లనివై దోఁచినను, వె

టనే యతఁడు చనిపోవును.

క. ప్రకటంబుగ నిజభావ
ప్రకృతులు దలపోయ మగుడఁ బడు వెస నెవ్వా
నికినది యవ్విపరీతము
తికినంత్యపుఁ గాలమరుగు దెంచుట జగతిన్. ౧౩౧

తా. ఎవనికిఁ దనభావమును- తనయాకృతియును, విచారింపగా మారిపోవునో, ఆతనికి సంత్యాకాలము సమీపించినదని తెలిసికొనవలెను.

ఆ. వె. ఒక్కనాడి యందె యుడుగక వాయువు
నడచెనేని రెండు నాడులందు
మానవునకు సమము గానట్లు చనునేని
నతనియాయు వల్ప మండ్రు బుధులు. ౧౩౨

తా. ఒకనాడియే వాయువుచేఁ జలించుచున్నటుల దోచినను, లేక నాడీద్వయమునందునో కేవిధమగు చలనము గలిగినటులఁ దోచినను, ఆతనికి నాయువు స్వల్పమని గుర్తెరుగ వలయును.

——* కర్మ విచారము. *——

ఉ. కావున నీయరిష్టముల కల్మష బుద్ధి నెఱుంగ నేర్చి దుః
ఖావహ మృత్యునాశ కరమైన సదా శివయోగమున్ లస
ద్భావన నభ్యసించి యమృతస్థిర సౌఖ్యముఁ బొందుటొప్పు నా
నావిధకర్మ పాశదళ నం బొనరించుచు సజ్జనావళుల్. ౧౩౩

తా. కాఁబట్టి సత్పురుషులు నానావిధములైన కర్మములను త్రాళ్లచేఁ గట్టుబడక వాటిని దునాదుకలు చేసియిట్టి యరిష్టముల నాలోచించి సర్వదుఃఖాలయ మగు మృత్యువు వాతంబడ కుండు నటులను- నిరంతరాభ్యాస వశంబున సదాశివయోగమును వశపరచుకొని శాశ్వతానందము ననుభవింపఁ బ్రయత్నించ వలెను.

శా. ఆలస్యంబును బోలుశత్రువును దద్ధ్యంబెన్నఁ బ్రారంభముం
బోలంజాలిన బంధువుం గలఁడె యీ భూమీస్థలింగానతా
నాలస్యంబొక యింతయైన మదిఁజేయం జూడకుద్యోగియై

వాలాయంబున యోగిగావలయు ని ♦ ర్వాణాను రక్తుండిలన్. ౧౩౪

తా. ఈజగంబున మానవుల కాలస్యము బోలు- శత్రువును- ప్రారంభము బోలు మిత్రుఁడును లేఁడు. కావున మోక్షాభిలాషగల మానవుఁడెంత కంతయు నాలసింపక వెంటనే మహానురాగంబున శివయోగులు కావలయును.

క. యోగంబు నుభయకర్మ
త్యాగంబున గాక కలుగ ♦ దందు నవిద్యా
త్యాగమగున పుడమల వి
ద్యాగరిమము గలిగియోగి ♦ యగునట మీఁదన్. ౧౩౫

తా. ఉభయకర్మములఁ ద్యజించినగాని, యోగి కానేరఁడు. ఉభయకర్మములనగా నజ్ఞానము- ఆలస్యము ననునవి. అందును నవిద్యా త్యాగము ప్రధానము. అవిద్య అజ్ఞానము నశించినచో నాలస్యముకూడ నశించును. కాన నజ్ఞాన నాశముచే విజ్ఞానము గలిగి యోగి యగును.

వ. అవ్విధం బెట్లంటేని. ౧౩౬

తా. అదియెట్లులనఁగ

గీ. క్రియగలుగు వానికంటెను ♦ గర్మిష్ఠుఁడు క్రి
యావిహీనుని కంటెను ♦ బావనుఁడును
నెందు లేఁడని తెలిసిన ♦ సిద్ధబుద్ధి
మహిఁ గ్రియావిహీను గతినుండు ♦ మర్మమెఱిఁగి. ౧౩౭

తా. కర్మలాచరించిన వానికంటెఁ బాపాత్ముఁడును గర్మత్యాగికంటెఁ బుణ్యాత్ముఁడును ఎచ్చటను లేఁడని మర్మముగుర్తెరిగి క్రియావిహీనుఁడగు జ్ఞాని విధంబునఁ జరించుట సకలశ్రేయోనిధానంబు.

ఉత్సాహ వృత్తము.

కర్మములిన మెపుడు మేన ♦ గల్గియుండ నెంతయున్
నిర్మలుండు నయిన యాత్మ ♦ నిం గనంగ వచ్చునే?
మర్మమెఱిఁగి దర్పణంబు ♦ మలిన ముడుగఁ దోమఁగా
నిర్మలంబుగాక మున్న ♦ నీడగాన వచ్చునే. ౧౩౮

తా. ఎంతవరకు నీకర్మ మాలిన్యము గల్గియుండునో, అంతవరకు పరమాత్మను గాంచలేవు. అదియెట్టులనిన, మలినమగు నద్దముఁను నిర్మలముగాఁ జేయకుండిన దానిమాలిన్యమునందు ప్రతిబింబ మెటుల గన్పింపదో, అటులే కర్మ మాలిన్యమును జ్ఞానోదకమున శుభ్రపరచినగాని, జనులు పరమేశ్వరు ననుగ్రహ పాత్రులు కాఁజాలరు.

తే. గీ. ఉభయ కర్మంబు లెందాఁక ◊ నుడుగకుండు
నొలినంటాఁక నొకటిపో ◊ నొకటిపొంది
యుండుదేహము గర్మముల్ ◊ రెండు పోలియు
నప్పుడెగాదె శరీరతు ◊ యావసరము. ౧౩౯

తా. కర్మద్వయ మెంతవరకు నశింపకుండునో, అంతవఱకు నొకటిపోయినను నొకటిదేహము నాశ్రయించియుండును. కావున గర్మద్వయము నశించినపుడే శరీర నాశనము యొక్క విచార మవసరమని తోచునుగదా?

తే. గీ. అపున రావృత్తి పదము ◊ కర్మావలంబ
మునను సిద్ధించునది ◊ మోహమునఁ గడంగి
కర్మముల కోరిసలిపెడు ◊ కష్టజనులు
మూఢులని చాటు నాగమ ◊ ములు ధ్రువముగ ౧౪౦

తా. ఏకోరికయుఁ గోరక యెవండీశ్వరార్పితముగఁ గర్మ లాచరించునో, వానికి మోక్షంబు సిద్ధించుట నిశ్చయము. అటులఁ గాక కోర్కెలతో కర్మంబుల నాచరించెడి వారు మూఢులని యాగమములు ఘోషిల్లుచున్నవి.

తే. గీ. వ్రతములను దీర్థములను ప ◊ వాసములను
దేవపూజలఁ గర్మికిఁ ◊ దీపిపుట్టు
సద్గురుఁడు గల్గెనేని ని ◊ ష్కర్మికివియుఁ
జప్పనై యుండు వేయును ◊ జెప్పనేల? ౧౪౧

తా. వ్రతములందేమి? తీర్థములందేమి ? ఉపవాసములందేమి? దేవతార్చనలందేమి? కర్మనిష్ఠగలవానికిఁ బ్రేమజనించును, నిష్కర్మికి సద్గురుఁడొకండు గల్గినఁజాలు. ఈకర్మలన్నియు నతనికిఁ జప్పగానుండును. అనఁగా రుచింపవని భావము.

క. కడగట్టిన చూడపగిది

నెడయాను గ్రియాభియుక్తుఁ ꕀ డిట నిష్క్రియుఁడై
యొడిసెలను ఱాయి చనుకై
వడితత్త్వము గలయు బాధు ꕀ వర్గముతోడన్. ౧౪౨

తా. కర్మాభిలాషి ఓడస్తంభము గట్టిన యోడవలె మెల్లగా గమ్య స్థానముఁ జేరును. నిష్క్రియుఁడు యొడిసెలనుండి రాయి రువ్విన శీఘ్రముగా వడి గమ్య స్థానము చేరునటు లద్వైతలో బంధుబృందముతోఁ గూడ తత్త్వమున గలియుఁగ లఁడు.

తే. గీ. పసిఁడి యినుప సంకలియల ꕀ భంగులైన
పుణ్యపాప కర్మంబులు ꕀ పొందకుండఁ
గర్మియయ్యును జగతి నిష్ ꕀ కామ జనుఁడు
వనజపత్రము నీళ్లఁబొం ꕀ దని విధమున ౧౪౩

తా. ఎవండు బంగారమును నినుపసంకెల గాభావించునో, అతని పుణ్య పాపంబు లంటు నేరవు కావున మానవులు కమలపత్రంబులందలి నీటి బిందువులం బోలెఁ గర్మి యయ్యు కోరిక లేక శివార్పణముగా నాచరించుచుఁ గర్మరహితుని వోలెఁ జరింప వలెను.

క. ధర్మాధర్మము లనియెడు
కర్మంబులు రెంటివలన ꕀ గట్టువడక ని
ష్కర్మ గతిఁ జరించెడి యా
మర్మము సద్గురు కృపాస ꕀ మన్వితుఁ డెఱుఁగున్. ౧౪౪

తా. కావున ధర్మాధర్మములను కర్మద్వయంబు నను గట్టుపడక నిష్కర్మమార్గమునఁ జరించు మర్మమును సద్గురు కృపాపాత్రులగు వారలు తెలియఁగలరు?

సీ. శ్రీగురు కరుణావి ꕀ శేషంబు గలిగియు
నజ్ఞాన తమమెల్ల ꕀ నణఁగదేని
నజ్ఞాన తమమెల్ల ꕀ నణఁగియు నిజతత్త్వ
మిదియని చూడంగ ꕀ నెఱుఁగఁడేని
తత్త్వసందర్శన ꕀ తత్పరుండయ్యును
సంశయంబులు విడ ꕀ జాలఁడేని
సంశయంబులు విడ ꕀ జాలియు నిహలోక

పరలోక సౌఖ్య విశ్ర భ్రాంతుఁడే ని
తే. గీ. భ్రాంతివిడిచియు సతతతీ ర్థవ్రతోప
వాసజపహోమ పితృమేధ వరసురార్చ
నాదికృత్యంబు లందు మోహంబు గలుగు
నేనియెఱుకకు నిధిఫల మేతలంప. ౧౭౫

తా. సద్గురు కృపగలిగినను నెవనికి నజ్ఞానము నశింపదో, అజ్ఞానము నశించినను తత్వమిది యనియెవఁడు తుర్తెఱుఁగడో, తత్వమును గన్నులార గాంచుచున్నను నెవనికి సంశయములు నశించవో, అవినశించినను- నైహికాముష్మిక భోగంబు లందెవండు భ్రాంతి నొంది యుండునో, భ్రాంతినివిడిచినను నెవనికిఁ దీర్థములందును- క్షేత్రము లందును- వ్రతము లందును- ఉపవాసము లందును- జపము లందును- హోమము లందును- దేవతార్చనాది కృత్యము లందును మోహంబుగలిగి వర్తించునో, ఆతడు ముక్తినొంద నేరఁడు. జ్ఞానము గలిగినను- నట్టివానికి సర్వము వ్యర్థము అనఁగా జ్ఞానవంతుఁడయ్యు-సర్వవిషయములు దెలిసియు- విషయవాస నాపీడి తుండయిన జనునకు సర్వము వ్యర్థమేయని భావము.

క, ఎడదవ్వుల రజ్జుశుక్తిం
బొడఁగని భుజగమును వెండి ఁబోలిచి మఱియే
ర్పడఁ గనుఁగొని తెలిసినకై
వడి మిథ్యా భ్రాంతి యుడుగ వలయుందజ్ఞుల్. ౧౭౬

తా. దగ్గఱగాని, దూరమందుగాని, త్రాడుచూచి పామనుకొనియు- ముత్యపుచిప్పనుజూచి వెండియనియు- తలంచి భ్రాంతినొందినను- దిరిగియథార్థమును గనుగొనిన తరువాత నెటుల భ్రాంతిని వదులునో, అట్లే ప్రపంచ మందలి భ్రాంతివదిలి శివస్వరూపముగా నెఱుంగవలెను.

క. ఈయీతిఁ గాశీక్షేత్రకు
రుక్షేత్రము లాదిగాని రూఢములగు పు
ణ్యక్షేత్రములకు నరుగన
పేక్షింపు దురాత్మ తీర్థ మెఱుఁగని వారల్. ౧౭౭

తా. ఆత్మతీర్థంబుల గుఱ్తెఱుఁగని వారైకొండఱుకాశీక్షేత్రకురు క్షేత్రములాదిగా

గలతీర్థంబుల నరుగ నపేక్షింతురు.

శా. అంతస్థంబగు నాత్మతీర్థము పరి । త్యాజ్యంబు గావించి వి
భ్రాంతిన్ బాహ్యనదీ విశేషములఁ । జెప్పన్ వించుఁ గాన్లీ చంబో
నంతంతం దిరుగాడు వారలు వెసన్ । హస్తస్థ రత్నంబున
న్లాంత న్వైచుచు గాజు పూసయెడ న । త్యాసక్తిం గోటారయన్.

తా. తనలోన నున్న తీర్థంబుల వదిలి బాహ్యతీర్థమహిమలు వచింప ముదంబునఁ గాన్లీ ద్బ్రహ్మోసుచునంత వరకుఁబోవుట- చేతియందున్న రత్నంబును బారవైచి గాజుపూసకై దిరుగుట వంటిదిసుమా?

చ. మకరము లాదిగాఁ గజల । మధ్యమునందు వశించు జీవజా
తికిని నభఃపథంబునన । తిత్వరితంబునఁ బాఱుపక్షి రా
శికిని జలాంబ రాంతర వి। శేషము బొందునె యెందునైన ఁబా
యక మఱియట్లకాదె తమ। యాత్మనెఱుంగని భ్రాంత చిత్తులున్.

తా. నీటియందు దిరుగు మొసలు- చేపలు మొదలగు జలజంతువులకును- ఆకాశంబునఁ బరుగెత్తెడి పక్షిజాలంబు నకును- జలాంబరాంతరముల విశేషంబులు దెలియనేరని యటులే- మానవులును- భ్రాంతులై తమయాత్మల గుర్తెఱుగ నేరకున్నారు.

క. ప్రియమలరగ ఁదీర్థంబులు
పయః ప్రపూర్ణములు దేవ । పరిసరము శిలా
మయ ములని బుధులెఱిఁగి ప్ర
త్యయముగ నీక్షింతు రాత్మ । నన్నియు వసుసన్. ౧౫౦

తా. తీర్థములన్నియు పయః పూర్ణములనియు- దేవాలందఱు శిలామయము లని యెఱిఁగియు పండితులాత్మ యందేయన్నియుఁ గాంతురు.

తే. గీ. తానెచటి కేగినను మఱి । తానెకాక
యితరుఁడగ నేర్చునే జను । ఁడే విధమున
బుద్ధిఁ జూడంగ భావంబు । శుద్ధమైన
నఖిల తీర్థంబులును దన । యందలేవె. ౧౫౧

తా. తానెక్కడికి వెళ్లినను బ్రజలందఱు తనను నితరునిగ జెప్పక, తనపేరు నే- త

నయాకారమునే చెప్పినటుల- మనంబు పరిశుద్ధమైనచో సమస్తతీర్థంబులును దనయందే గలవు. కానభావశుద్ధి యవసరము.

—* శరీరతీర్థ వివరణము. *—

వ. అవిముక్త్యాది యనిన. ౧౫౨

తా. అవియే వినుము.

క. అమరగ భ్రూనాసామ
ధ్యమమగుఁ గాశీస్థలము ప్ర♦యాగ యగుర్ హృ
త్కమలము శ్రీపర్వత ము
త్తమాంగమని చెప్పుదురు గ♦దాతత్త్వ విదుల్. ౧౫౩

తా. కనుబొమలకు నాసికకును మధ్యనున్న స్థానము, కాశీక్షేత్రము. హృత్పుండరీకము ప్రయాగక్షేత్రము. శిరంబు- శ్రీశైలము. అనితత్త్వవేత్తలు వచింతురు.

క. ఆకుజగతిలోఁగు శస్థల
ము గురుక్షేత్రంబు ఫాలసీ మునుఁ గేదారం
బగు నంధ్రదు మఱియుఁ దీర్థము
ల గణితముగఁ దనువునందసీ యనయము నుండున్. ౧౫౪

తా. మఱియు- గుశక్షేత్రము గురుక్షేత్రము కేదారమును ఫాలంబున గలదు. ఆఫాల ప్రదేశమే పైక్షేత్రములుగఁ బేర్కొనఁ బడినది. తక్కిన తీర్థము లన్నియు నిటుల నే యాత్మయందే గలవు.

ఆ. వె. ఆరయ నిట్లయుగుట♦యాత్మ తీర్థము విస
ర్జించి బాహ్య తీర్థ♦సేవసేయఁ
గోరి భ్రమసి తిరుగు♦కుమతుల నేమనఁ
గలదు దీనిఁదెలియ♦వలదె బుధులు. ౧౫౫

తా. కావుననిట్లు విలసిల్లెడి యాత్మతీర్థంబుల వదిలిబాహ్య తీర్థంబుల గాంచి తిరుగు కుమతుల నేమన వలయును?

క. జనుఁ డిట్టిదె కాశ్యప భ్రాం

తిని పేసిత బుద్ధినన్య ◆ తీర్థములాడఁగన్
జనకతన యాత్మఁగను గా
వనుఁడని సందేహ ముడుగ ◆ వలయును జేర్మిన్. ౧౫౬

తా. జనులాత్మ యందలి తీర్థంబుల గుర్తెఱిఁగి భ్రాంతుఁడై యన్య తీర్థంబులపాం థుఁబోక తనయాత్మయె మిక్కిలి పవిత్రమైనదని తలంచి సంశయములుడుగ వలయును.

——* కర్మయజ్ఞ దూషణము. *——

క. శ్రుతిచెప్పెడి నవిభ్రమ మై
క్రతువులు సేయుదురు మోక్ష ◆ కాంక్షను హింసా
మతియని తలఁపరు తమతమ
మతిలోపలఁ గొందఱిట్టి ◆ మాయయు గలదే. ౧౫౭

తా. వేదములు చెప్పిన వనిభ్రాంతితోఁ గొందఱు మోక్షకాంక్షులై యాగములుచే యుదురుగాని, అదిజంతు హింసాకరమని కొంచెమును దలంపరు గదా? ఆహా! యిట్టి మాయయెందైన గలదా?

శా. యాగంబుల్ నిగమోక్తిమైఁ జలిపి దే ◆ హాంతంబు నన్నాకలో
కాగారంబున నుండుఁ గొంతదడవ ◆ త్యంతోత్సవ ప్రాప్తుఁడై
వేగంబారఁగఁ గ్రమ్మఱ న్మగిడి యు ◆ ర్విం బుట్టునానాక్రియల్
రాగద్వేషముఁ బొంది సేయునపవ ◆ ర్గం బేగతిం గల్గునే. ౧౫౮

తా. వేదముచెప్పిన చొప్పున యాగంబు లొనర్చియు దేహాంతమున గొంత కాలము వఱకు స్వర్గలోకంబున నుండిభోగంబు ననుభవించితిరిగి భూమియందు జన్మించి నానా కర్మలకు లోనై రాగద్వేషములను వలయందుఁ జిక్కికొని తిరిగి జన్మపరంపర ననుభవింప వలసినదేగాని మోక్షమేగతిని వారికిఁగల్గును? అనఁగా మోక్ష మెప్పటికిని వారికిఁ గల్గదనియే కవిహృదయము.

ఉ. అక్కట నిర్దయం బశువు ◆ లాచున నాథలు మేఁక పోతులన్
ద్రుక్కకి చంపి నంజుడులు ◆ సొక్కుచు సిక్కుచు డిందుచెల్లఁడన్
గ్రక్కున నట్టి మేఁకలవు ◆ ఁగాలను గూసిన వెళ్లఁగాక వా

కెక్కఁగ మోక్ష సౌఖ్యపదవి యెక్కెడఁ జిత్తమునందలంపఁగాన్.

తా. అహో! దయావిహీనులై పశువులని మేకపోతులను గొందఱు చంపుచు మాంసమును దినుచు- సోమయాజులమని నిక్కుచుందురు గాని, వారికిమోక్ష సుఖంబించు కంతయులేదు సుమీ? నిజము విచారింపఁగా నా మేకలకుఁ గాలము మూడి చేయుటయే గాని, వీరికిమోక్ష మొసగుటకై చనుటగాదు.

తే. గీ. కర్మబీజంబు సంకల్ప కలనమునన
యంకురింపుచు నంతంత నతిశయిల్లు
నది యసంకల్ప మనుకుఠా రాహతినిజ
వముదలిర్పంగ ఖండింప వలయు మొదల ౧౬౦

తా. కర్మయను విత్తనము సంకల్పమున నంకురింపుచు మహావృక్ష మగును గాన దానిని ప్రాజ్ఞులా సంకల్ప రాహిత్య మను గండ్రగొడ్డలిచే మొదలంట నరికివేయ వలయును.

—* జ్ఞానయజ్ఞ ప్రాశస్త్యము. *—

తే. గీ కర్మమెల్లను భోగైక కారణంబు
జ్ఞానమెల్లను మోక్ష భాజనమె యగుట
కర్మయజ్ఞంబు వలని యాకాంక్షలుడిగి
సతత విజ్ఞానయజ్ఞంబు సలుపవలయు. ౧౬౧

తా. కర్మమంతయును భోగముల కాలయము. జ్ఞానమంతయు మోక్షమునకు దాపు. కావున కర్మయజ్ఞంబు నందలి యాశవదలుకొని నిరంతరము విజ్ఞానయజ్ఞము నవలంబింప వలయును.

చ. అరయఁగఁ ద్రాడు పామనిభయంబును బొందినమాత్రలో విషం
బరుమఁగ నెక్కఁజాలమైన నాత్మఁగలంగక త్రాడుగాక నాఁ
బారయదు తద్విషంబును ప్రబుద్ధుఁ డిట్లుగఁ గర్మకోటులన్
సగబారయుండ కర్మఫలశంకివహింపమిఁ జేసియెత్తరిన్. ౧౬౨

తా. త్రాటిని జూచిపామని భయంబు నొందినచో, విషం బెక్కుట నిశ్చయము

ర్తాదు గాక పాపాత్మునకు నరకంబున భయంబు నొందనిచో నిక బాధ యెందుకునా? కర్మకోటులందలి కర్మఫలం బనుభవింప గోరనిచేత జ్ఞానితోఁ దుల్యుఁడెందును గాఁ బడఁడు.

క. వేయేమి న్యాయమార్గానక
యేయాయాసమును లేక హింసాక్రియలం
జేయకయుండఁగ మోక్ష
శ్రీయొదవ జ్ఞానమఖముఁ జేయఁగవలెజే.

తా. ఆయాసకరంబు మాత్రమును లేక, హింసాకర్మములఁ బరిత్యజించి జ్ఞానయాగము సేసినవారికి మోక్షము సులభముగా లభించును.

వ. అది యెట్లంటేని. ౧౬౪

తా. అదియెట్టు లనఁగ.

చ. అరయఁగఁ జిత్తబుద్ధులు నహంకరణంబును మూఁడుబుత్త్విగా
వరణముఁ జేసి యుల్లప్రణవంబు కయూపముఁ జేసి యింద్రియో
త్కరమును బ్రాణముల్ పదియుగా పశుసంతతి గాన నాహతస్ఫు
రదురుమంత్రఘోషణము పొంగుచునింగిఁ జెలంగి మ్రోయఁగాన్.

మత్తకోకిల
సేమమార విశుద్ధచక్ర శశిస్థలంబుల మధ్యమున్
హోమకుండముఁ జేసియందలి జ్యోతిలోపలఁ దత్పశు
స్తోమము దిగవేల్చి యంతట సోమపానముఁ జేసి ని
ష్కామభావన సోమయాజియుఁ గాఁదగున్ సుజనుండిలన్. ౧౬౫

తా. మానవులు- చిత్తము- బుద్ధి-అహంకారములను మూఁడింటిని బుత్త్విజులనుగాఁ గావించి ప్రణవమును యూపస్తంభమును జేసి యింద్రియ సమూహము- దశప్రాణములను- పశుసంతతిగా నొనర్చి యనాహత చక్రమున మంత్రధ్వనులు మిన్నుముట్టునటుల మ్రోయుచుండ, విశుద్ధచక్ర శశిస్థలముల మధ్య హోమకుండము దీసియచ్చట వెల్గుచున్న జ్యోతిలోఁ బైపశు సంతతిని వేల్చి నిష్కామ భావన సోమపానమునం జేసి సోమయాజు

తై మెలంగవలయును. అట్లుగాక కేవలపశుయాగము లొనర్చువారిని సోమయాజు లనిచెప్ప వచ్చునా?

క. ఏమతమును గాదని మఱి
యీమతము పరిగ్రహించి యెలమిఁ జెలువఁగా
(శ్రీ)మఱియు జ్ఞానయజ్ఞం
బేమియు సందియము వలవ దిచ్చును ముక్తిన్. ౧౬౭

తా. అన్ని మతముల వదిలి యీశివయోగుల మతమును స్వీకరించి ప్రేమచే జ్ఞానయజ్ఞం బొనర్పఁ దప్పక ముక్తి గలుగును.

క. నానావిధముల నిట్లు
జ్ఞానముఁ దలఁగింపఁగా నిక జంబారఁగ సు
జ్ఞానంబొడగూడును సు
జ్ఞానముదక్కంగ మోక్ష సౌఖ్యముగలదే. ౧౬౮

తా. అనేక విధములుగా నున్న యజ్ఞానము పోనడంచిన గాని సుజ్ఞానము గలుగ నేరదు. అట్టి సుజ్ఞాన ప్రాప్తికంటె మోక్షసుఖము వేరఁగ గలదా?

సీ. సల్లలితజ్ఞాన వల్లరీజాలంబు
నట్టనదట్టమై చుట్టుకొనఁగ
సదమలంబగు సూరిజనవాక్ప్రసూన సం
శోభిత గంధంబు సుడియుచుండఁ
బరిపక్వ ఫలములఁ బ్రాలిన యోగము
వేదాంతశాఖలన్ వినుతికెక్క
పడమటఁ బఱెంచున్ కడుచల్లనగుగాలి
మొయివచ్చు నమృతంబు మేసఁజిలుక
తే.గీ. రమ్యతరతత్త్వసంజ్ఞికారామభూమి
జలనలేనిస మాధి యాసనము గాఁగ

నున్నతానంద మయవృత్తిఁ నుండుటొప్పు
నెన్నియుక్తులు నీయుక్తిఁ కీడుగావు. ౧౩౯

తా. సుప్పదియారు తత్త్వములచే (బ్ర)కాశించు చక్కని యుద్యానవనమున సుజనులు- నిర్మలము- నిశ్చలనమునగు సమాధి నిష్ఠచే యోగ ముపాసించవలెను. ఆయారామ భూమియందు నాతప బాధలు లేకుండ జ్ఞానలతల సమూహాము దట్టముగా వ్యాపించి యున్నది. పండిత జనుల వాక్కులను పుష్పముల వలన గుప్పుగుప్పున నే తెంచుమంచి పరిమళమాతోట యంతంతటను వ్యాపించి యున్నది. బాగుగాఁ బండిన ముక్తిఫలంబులచే నేలమీదకు వ్రాలిన ఆగమములు- ఉపనిషత్తులు- అనుకొమ్మలచే నాసుందరోద్యానము విలసిల్లుచుండును. పడమటి నుండి వీతెంచు గాలితో వచ్చెడి యమృత బిందువులు శరీరము నందు హాయిని గొల్పుచుండును. కావున నిట్టి యుద్యాన భూమియందు నిశ్చల సమాధి మగ్నుఁడై నిర్మలానందమున నుండుట తగును. ఎన్నిమార్గము లితరము లున్నను- దీనికిఁ దుల్యములు గావు.

వ. ఇత్తెఱంగున. ౧౪౦

తా. ఈవిధమున.

క. శివయోగంబగు నంతకు
నవిరతము నకామవృత్తి నర్హంబగు క
ర్మవితానము సేయుచు నది
శివార్పణము సేయునది విశేషము జగతిన్. ౧౪౧

తా. శివయోగ సిద్ధిగలుగు నంతవఱకు నిష్కామ బుద్ధితో గర్మలనాచరించి శివార్పణము చేయవలయును.

వి. ఇందువలన గవి యభిప్రాయము యోగసిద్ధి తర్వాత గర్మమార్గము నిష్ప్రయోజనమనియు- అది యుండినచో జన్మపరంపరకు హేతుభూతమనియు- గావున శివయోగసిద్ధి గలుగు నంతవఱకుఁ గర్మాచరణము ముఖ్యమై నటులను దోచుచున్నది.

క. ప్రవిమల సత్కర్మసమా
మనశ్యముగనుఁడుగవలవ దట యోగాభ్యా
సవిధికతన నొందుగకును ని

పరత్రాశత నడిరెయుముకుకు నొదాకనుగిక్క. ౧౭౨

తా. కర్మసమూహమును- యోగాభ్యాస కారణముగఁ బరిత్యజింపఁ గూడదు. తమంత తామే యాకర్మలు నశించి పోవలయును. అనఁగాఁ గర్మయే దన్ను వదిలి పోవల యును గాని, అంతవరకును దాను మాత్రము గర్మను విడువ గూడదు.

క. బ్రహ్మము నిజమెఱుఁగక హం
బ్రహ్మంబని సత్క్రియలకుఁ బాసినకర్మ
బ్రహ్మోభయ విభ్రష్టుకు
బ్రహ్మాండములోన విహారంబులుగలవే. ౧౭౩

తా. బ్రహ్మమన నెవరో యెఱుఁగక నేనే బ్రహ్మమని విఱ్ఱవీగుచు- నటుబ్రహ్మసాక్షాత్కారములేక ఇటు కర్మాచరణములేక యుభయ భ్రష్టులైన వారికీ బ్రహ్మాండమునం దెచ్చటనైనను- ఐహిక సుఖము గాని, యాముష్మిక సుఖము గాని గలదా?

క. కర్మములు గోరి సలుపుచుఁ
గర్మఫలానుభవ శంకఁ గదురుచు వెలి ని
ష్కర్మిననుచుఁ గేవల స
త్కర్మముఁ బెడఁబాయు పాపకర్మియుఁ గలఁడే. ౧౭౪

తా. తానుబుద్ధి పూర్వకముగఁ గర్మల గోరిక తీరక లెత్త నాచరించుచుఁ గర్మఫలమను భవించవలయునను సంశయమున బాహ్యమున నేను నిష్కర్మిని- యని వచింపుచు- సత్కర్మల దూషించుట సజ్జనుల ధర్మము గాదు.

క. క్రమమునఁ దరుఫలముల ద్రు
క్కములు నులిచి త్రెంచి వైచుకరణి మనఃపా
కము గాకమును శిఖాసూ
త్రములు విడుచు పాపకర్మిఁ దడవఁగఁజనునే. ౧౭౫

తా. వృక్షమునందలి బాగుగా పండిన ఫలంబుల, దెంచు విధంబున మనఃపరిపాకము గుదిరిన తర్వాత శిఖాసూత్ర పరిత్యాగము చేసిన చేయవచ్చును; గాని, మొదలే శి

ఖానశాస్త్రములు బ్రెంచి వేయు మాహాత్మ్యం సేయక కర్మముచే నేమి వున్నది. దేహము న్నంత వఱకుఁ బ్రారబ్ధ ముండుట చేతను, ప్రారబ్ధ కర్మ ననుభవింప దగిన దగుటచే తను. మఱి పరిపాకము గుదురుట దుర్లభమని తోచుచున్నది. అందు వలననే శిఖా సూత్ర పరిత్యాగమును వెంటనే చేయఁగూడదు.

చ. అలవడ భూసురప్రవరుఁ డాదిగ నంత్యజుఁ డంతకైన వా
రలయెడ నొక్కరూపుగఁ దిరంబుగఁ జూడకయున్న కీర్తియుం
గలిమియు నాశసేయక సుఖంబునఁ జెందక యున్న సత్క్రియల్
దలఁపఁగఁ జేయలేక మతిఁ దప్పిన సోమునిఁ జెప్పనేటికిన్. ౧౭౬

తా. బ్రాహ్మణుఁడు మొదలంత్యజుని వరకుగల సర్వమానవులను సమానముగ జూడక, కీర్తి సంపదల యపేక్ష వదలక సుఖమును పరిత్యజింపక ముందే కర్మల పరిత్యజించుట సోమరి పోతుల లక్షణము.

క. కావునఁ బాపపుఁ ద్రోవలఁ
బోవక నిగమోక్త ధర్మములు నిజశక్తిన్
గావింపుటొప్పు నిస్పృహా
భావంబున నదియె ముక్తిపథమండ్రు బుధుల్. ౧౭౭

తా. కాఁబట్టి దుష్టమార్గముల నవలంబింపక నిగమాగమోక్త ధర్మముల శక్తికొలఁది నిష్కామ బుద్ధితో నీశ్వరార్పితముగా నొనర్ప వలయును, అటు లాచరించుట యముక్తి మార్గమని పండితులు వచింతురు.

తే. గీ. తా నొనర్చిన పుణ్యంబె తన్ను మనుచు
దా నొనర్చిన పాపంబె తన్నుఁ జెఱుచు
గాని తనుమన్పఁ జెఱుపంగ నొరు లెందు
నెవ్వరును లేరు జనులిదె యెఱుఁగ వలయు. ౧౭౮

తా. తాను జేసిన పుణ్యములు తన్ను రక్షించును. తాను జేసిన పాపములు తన్ను నశింపఁ జేయును. తన్నుగాపాడుటకు గాని, చెఱుపుటకుఁ గాని, మానవు లెవరును గర్తలు కారని తెలిసికొని రూఢిగా నమ్మవలయును.

—— జగత్కర్త యీశ్వరుఁడని నిరూపించుట.

క. కనుఁగొనఁ బ్రాపంచికమున
కనయము నీశ్వరుఁడు కర్త యైయుండఁగ లేఁ
డన నెట్లువచ్చు భాట్టుల
యనవున సదసద్వివేక హానియగుఁగదా. ౧౭౯

తా. విచారింపఁగ నీ ప్రపంచమున కంతయు, నీశ్వరుఁడు కర్తయై యుండఁగా భాట్ట మతస్థులవలె లేఁడని చెప్పుట తప్పు సుమా?

క. జగదీశ్వరునకుఁ బగయును
మొగమోటయు లేదు నరులు మొగిఁ జేసిన క
ర్మగతిని శుభాశుభంబులు
దగిలియనుభవించు చోటఁ దాసాక్షియగున్. ౧౮౦

తా. జగదీశ్వరుఁడగు నాపరమేశ్వరునకు మొగ మోటము యనఁగా వీరు నా బంధువులని ప్రేమగాని, వీరు నా శత్రువుల నిద్వేషము గాని, లేదు. జీవులు తమతమ పురాకృత కర్మ వశంబున శుభాశుభ కర్మల ననుభవింతురు. అట్టిచోఁ బరశివుఁడు సాక్షీభూతుఁడు గానుండును.

వ. ఇట్లు భాట్టులు కర్మంబ సుఖదుఃఖకారణంబు గాని పరమేశ్వరుం డనంగ నొక్క నియామకుండు లేఁడంద్రు. అది యబద్ధంబు. ద్రోహంబు చేసిన వానికి ద్రోహంబు సంకలియయ్యె వచ్చునే. ఆసంకలియ పెట్టించెడికర్త యొకఁడుగలుగుఁగాక. హితముఁ జేసినవానికి సాహితంబ యాందోళికా చ్ఛత్ర చామరాదులై నడచి వచ్చునే. యవికర్త్రాధీనంబులై వచ్చుఁగాక. కావునదదీయమతంబ యుక్తంబు. జీవాత్మ వాదులు కొందఱు జీవ స్వాతంత్ర్యంబుం జెప్పుదురు. వారలజ్ఞులని తెలియవలయును. ఎట్లనిన జీవుండు ప్రారంభించిన పనులెల్ల ఫలించునని చెప్పవచ్చునే? యొకానొకచోట ఫలియించుట గలిగిన జాత్యంధుండు తెరువు నడుచుచు నొక్క మూఁటు తెరు

పుడప్పుడు నొక్కమాఱు చెదుపున వచ్చునట్లు, కీటకంబు ప్రమాను దొలుచునప్పు డొక్కొక్కచోట నక్షరాకారంబైన యట్లు, జీవాత్మ కర్తృత్వంబు నని తెలియునది. జీవాత్ముండు పశువనం జను. తత్పతియైన పరమేశ్వరుండు పశుపతియనందగు. పశువులకుఁబతియు ప్రమాదవి శ్రుతి ప్రమాణంబు గలిగియుండు, నెట్లనిన–పశుపతినామంబునంగల షష్ఠీతత్పురుష సమాసంబుతోఁ గూడ శ్రుతి నమస్కరించుటం జేసి "అత్ర వేదాః ప్రమాణం" బండ్రు. గావున నిట్టి జీవజ్ఞానంబు వైదిక మతంబై ప్రవర్తిల్లు నదియు నుం గాక, యుత్పత్తి వేళఁబశుపతి తాన భవనామ రూపంబున స్రష్ట ప్రజాపతి కాలసమస్త భూతంబు లకు నంతర్యామియై రజో గుణంబుతోఁ గూడి సృజియింపును, స్థితి యందు మృడ రూపంబున మనుప్రభృతుల ముఖంబున ధర్మశాస్త్రంబులు రచియించి సత్పథంబు చూపించి విష్ణునామ కాలభూతాదులకు నంతర్యామియై సత్త్వ గుణంబు తోడం గూడి రక్షించును. సంహారంబునందు హరరూపంబున రుద్రాగ్ని సూర్యాంతక కాలభూతంబులకు నంతర్యామియైతమో గుణంబు తోడఁగూడి సంహరించు నీత్రిగుణంబులు నతిక్రమించి శివస్వరూపంబు నందును నాశ్రయించిన సర్వదుర్లక్షణదూరులును సర్వసులక్షణ సంపన్నులును సతత సంతృప్తి సహితులును నూర్ధ్వ రేతస్కులును నిత్యముక్తులును నిజభక్తులునగు సనక సనందన సనత్కుమార సనత్సుజాతాదులకు నంగుష్ఠ ప్రమాణదేహులగు వాలఖిల్యాదిసిద్ధులకును శుక వామదేవాది శుద్ధులకునంతర్యామియు ధ్యేయుండును నై పరమానంద ప్రదాయకుండగుచునుండు నివి చతుర్వ్యూహంబులనందగుఁదాన సృజియించిన సృష్టిలోనఁగొందఱి దుఃఖ సంసారులను, గొందఱి సుఖ సంసారులనుగా సృజియించిన పశుపతికి వైషమ్య నైర్ఘృణ్యంబులు ప్రాప్తంబులు గాకుండునే? యనినఁ దత్పశువుల పుణ్యపాపాభిమానంబులు కారణంబులుగాఁ జేసి చూచుచు వినోదించుచుండు నెట్లనిన:— పారావత శుక శారికా

దులం జేసిచి తద్వినోద సుఖంబులం బొందు నొకానొకపుడు షండమునుం బోలె నానావిధ గోమహిషాది పశువులం గాఁడి సిడిబలువగు రజ్జువులం గట్టి కసవు నీరిడ్యో మొదలం బెట్టి రక్షించుచుం దనకు వలసినపుడు విడుచుచు నుండు గోపతియుం బోలె, నానావిధ పశువులం బుణ్య పాపాభిమాన పాశంబులం గట్టి సుఖదుఃఖంబులను గ్రాసంబుగఁ బెట్టి యందులోనం దనదు కటాక్షవీక్షణంబు లెవ్వరిపయిం బొలసె నప్పుడు వారలం బాశ బంధముక్తులుగాఁ జేయుచు జగత్ప్రవర్తనంబు లీలయుం బోలెఁ జలుపుచు సుఖించుచుం దనకు షడ్వర్గ షడూర్మి పంచకోశ షట్కౌశిక తాపత్రయాగుణత్రయాదులు గలుగక సీమితోడం గూడిన జగన్నటనంబునకుం బ్రానొక్కండు సాక్షియు నిర్లేపియునై నిత్యతేజో నిధానంబై బ్రహ్మవిష్ణు రుద్రమహేశ్వర సదాశివాద్య నాది నాద బిందు కళాది తత్త్వాతీత సంజ్ఞ కుండై షట్త్రింశత్తత్త్వాధి కుండునని చెప్పం దగి పరశివ బ్రహ్మంబగు పశుపతికి వైషమ్య నైర్ఘృణ్యంబు లేల కల్గు నట్లుగావున బశుపతియైన పరశివుం డమ్ముముక్షువుల కెల్లను పాస్యుం డనుట సకలవేద శాస్త్ర సిద్ధాంతంబు. ౧౯౧

తా. భాట్ట మతస్థులు, కర్మమే సుఖప్రాప్తికిని దుఃఖప్రాప్తికిని గారణముగాని, తదతిరిక్తముగ దేవుండు వేరే లేడందురు.

జీవాత్మ వాదులు జీవుఁడే స్వతంత్రుఁడు గాని, యతని కంటె పరోక్షుఁడు కర్త లేడందురు. కాని న్యాయంపుగా నీరెండును మన సంగతములే.

ఒకఁడు దొంగతనముచేసిన వాఁడని యనుకొనుఁడు. అందుకు దండముగా వచ్చిన నీ రుపురుని జంపెనని యనుకొనుఁడు. ఇటుల మహాపాప మొనర్చిన నతనికిఁ బ్రభువు రక్షకభటుల (బంపి సంకెలల వేయించి కారాగృహమున బందెపేసి దుఃఖము గలిగించకున్న ఆతని స్వాత్మ్య రూపమైన పాపమతిని మరలనట్టి దుష్కార్యంబునకే పురికొల్ప సంతోషంబును గల్గించును గాని యాదుష్కార్యము నుండి మరలించి దుఃఖంబును గలిగించునా? లేదు.

ఒకరాజు నదిలోఁబడి కొట్టుకొని పోవుచుండఁగా నొకఁడు మహాశ్రమపడి యీ

దుకొనివెళ్లి తనప్రాణమును రక్షించుకొనుటకు వలెనినిగూడ బ్రతికించి వాడని యనుకొన
డు. అతఁడొసఁగ్చ నహింస మాత్రమునకే బహుమతులఁ స్వయముగ జేయఁగలడా? లేదు. రా
జుచేత వతనికిఁ గావలసిన వస్తువుగాని, చివరకు నర్ధరాజ్యముగ్గాని యిప్పించఁగలడు. కా
వున పుణ్యపాప రూపములగు కర్మము లెన్నటికి సుఖదుఃఖములు కలుగఁ జేయవు. ఆపు
ణ్యపాపముల విచారించి శిక్షింపను రక్షింపను బరమేశ్వరుఁడు వేరే యొకఁ డున్నాడని
యెంచవలెను. కర్త లేకయచేతనములగు పాపపుణ్యములు సుఖదుఃఖములను స్వయముగాఁగ
లుగ జేయవని భావము.

జీవుఁడు గూడ స్వతంత్రుఁడుగాఁడు. అయినచో జీవుఁడు చేసిన పనులకొన్ని ఫ
లమంతము లగుటలేదా యని యడవచ్చును. నిజమే. పుట్టు గ్రుడ్డు మార్గమున నడుచుచు
మార్గము దప్పిపోకప్పుడు తనమార్గమున వచ్చునటులను, వజ్రకీటకము, కొయ్య తొలుచుచు
నొకప్పుడు తాక్షరాకారముగ దొలచునటులను జీవుండొనర్చినవి యాకస్మికముగ నొకానొ
కటి ఫలించును. అంతమాత్రంబునఁ గర్త గాఁడు.

జీవులు- పశువులు. పశువుల కధిపతి యగుటచేఁ బశుపతియని పరమేశ్వరునకుఁ
బేరువచ్చినది. ఈవిషయమై వేదములు ఘంటాఘోషముగా వచించుచున్నవి.

పరమేశ్వరునకుఁ జతుర్వ్యూహములుగలవు. అవి- భవ- మృడ- శివ నామముల
చే నొప్పారు. పశుపతియగు పరమేశ్వరుఁడు ప్రపంచోత్పత్తి కాలంబున ప్రజాపతి మొ
దలగు సమస్త భూతాంతర్యామియై భవరూపంబున సృజించుచుండు. విష్ణువుమొదలగు
సర్వభూతముల కంతర్యామియై మన్వాదులచే ధర్మశాస్త్రముల రచింపించి సన్మార్గము
నేర్పరచి మృడరూపంబున రక్షించుచుండు. రుద్రుఁడు- సూర్యుఁడు-అగ్ని, యముడు, కా
లము, భూతములు, అనువానియందు దనశక్తి నునిచి తమోగుణంబున హరరూపంబునహ
రించుచుండు. త్రిగుణాతీతుండై శివస్వరూపంబున నిత్యముక్తులగు సనకసనందనాది ము
నీంద్రులకును, బొటనవ్రేలంత ప్రమాణము దేహముగల వాలఖిల్యాది సిద్ధులకును, సుప్ర
సన్నుండై యుండును. ఈవిధముగఁ బశుపతియే సర్వప్రపంచమునుఁ జతుర్రూప భేదంబు
న నడిపించుచుండు.

పరశివుఁడే జీవప్రపంచమును సృజించెను గదా? ఆతనికింత పక్షపాతంబేల? కొంద
ఱిని సుఖవంతులగను, కొందఱి దుఃఖవంతులగను జేయనేలయని సంశయము గలుగ వచ్చు
ను. కాని, దానికి జీవులుచేసికొను పుణ్యపాపములే కారణముగాని పరమేశ్వరుఁడు కాడ
ని తెలిసికొన వలెను.

ఆయీశ్వరుడొక పశుపాలకుఁడు. పశుపాలకు డెటులగోవ్రజ భాదులకు దృణం

బువేసి నీరుపెట్టి త్రాళ్లఁగట్టుచు, దనకుఁ గావలసి నప్పుడు విడుచు చుండునో, అటులే సర్వేశ్వరుఁడు జీవులను పాశంబులను త్రాళ్లబిగించి పుణ్యపాపములను గడ్డివేసి తనకటాక్షు మెవనిపైఁ బ్రసరించునో, వానినప్పుడు బంధముక్తులుగాఁ జేయును. కాని,సర్వజనులసుఖ దుఃఖంబులు స్వకర్మకృతంబులు గదలంచి పరమేశ్వరు నిందింపక యనుభవించుచు తదనుగ్రహాభిలాషియై నిరంతరం బర్చించుచుండ వలయును.

ఆపరశివునికిఁ గామక్రోధలోభ మోహమద మాత్సర్యములను నరిషడ్వర్గములేదు. ఆకలి, దప్పి,జర, మరణము, శోకము, మోహముఅనుషడూర్ములు లేవు. అన్నమయ ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయ, ఆనందమయ ములను పంచకోశములు లేవు. షట్కోశములుగాని, తాపత్రయములుగాని, ఈషణత్రయములుగాని యాతనికిలేవు. ఇవి యన్నియు జగంబునకుఁ గలవు. దీనికి సాక్షీభూతుఁడై తేజోరూపుడై బ్రహ్మవిష్ణు రుద్ర మహేశ్వర సదాశివాద్యనేక నామంబులు గలిగి షట్త్రింశత్తత్త్వాధిపుడై ముముక్షువులకెల్లనాతఁడుపాస్యుడై యుండు. ఇదిసమస్త శాస్త్రంబులందుసిద్ధాంతముచే యఁబడినది.

తే. గీ. మోక్షసుఖమట్టి శివయోగ ♦ మునసుదక్క
నెట్టిక్రియలను లేకుండు ♦ నెఱిఁగి బుధులు
సర్వధర్మోత్తమంబైన ♦ శైవధర్మ
మలఘుమతి నాచరింపంగ ♦ వలయుమొదల. ౧౮౨

తా. మోక్షము శివయోగమునసేగాని నితరకర్మలవలన జేకూరదు. కానసర్వధర్మములలో నుత్తమమగు శైవధర్మము నాశ్రయించవలెను

క. ధర్మాతిశయమున నస
త్కర్మము సంక్షీణమగు వి ♦ గత కిల్బిషతం
బేర్మియు నున్ననరునకు
నిర్మలశివయోగ మహిమ ♦ నిజముగఁ గల్గున్. ౧౮౩

తా. శివధర్మము లాచరించినగాని, పాపములు నశింపవు. తదనంతరము గాని మానవునికి శివయోగమహిమ బుద్ధికి గోచరింపదు.

—* గురు శిష్య సంవాదము. *—

వ. మఱినజ్ఞాన నాశనకారణంబును శివయోగజ్ఞాన మూలంబును నై

న గురుశిష్య సంవాదంబుగల దదియెట్టిదనిన, నిరంతర శివజ్ఞాన, శివభక్తి శివధ్యాన, శివవ్రత శివలింగార్చన, పంచవిధ శివయోగ పూర్వక చతుర్విధ యోగాభ్యాస పరాయణుండైన గురునాథు నిదివ్యశ్రీపాద పద్మంబులకుఁ దత్ప్రియ శిష్యుండు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి, ముకుళిత కరకమ లుండగుచు, దేవా! భవత్ప్రసాదంబునఁ గృతార్థుండ నైతి, నిందుకు సందేహంబు లేదైనను మదీయాభిమత ప్రశ్నంబులకు నుత్తరం బవధరింప వలయునని, విన్నవించి యిట్లనియె. ౧౮౪

అ. అజ్ఞాన నాశనమొనరించి శివయోగజ్ఞానముకలుగఁజేయు గురుశిష్య సంవాదముగలదు అట్టిదానిని సాధకుల సులభ బోధకైఁగ వీంద్రుండిందు వచింపుచున్నాడు.

తా. శివజ్ఞానము శివభక్తి- శివధ్యానము- శివవ్రతము. శివలింగార్చనము— అను పంచవిధములయిన శివయోగముచేఁ బ్రకాశించుచు, మంత్ర— లయ-హఠ- రాజయోగ ములను నాల్గుతెరంగులగు యోగంబులభ్యసించి విలసిల్లుచున్న గురునాథుని సమీపమున కు శిష్యుండు చని దోసిలియొగ్గి" మహాత్మా! నేనడు గుప్రశ్నంబులకు సమత్తరము తీయవేడెద. మీకృపాకటాక్ష ప్రసారమాత్రముననే కృతార్థుండనైతినని విన్నవింపదొడగె.

క. ఎయ్యది చేపట్ట వలయు
నెయ్యది విడువంగ వలయు నెందాఁక మదిన్
నెయ్యమునఁ దత్త్వచింతన
మియ్యఖిలము నాకునాన తిమ్ము మహాత్మా. ౧౮౫

తా. గురువరా! ఏదివదలవలయును! ఏదిస్వీకరింపవలయును? తత్త్వవిచారమెంతవరకు చేయవలయును? ఇదియంతయు నాకు నానతీయుము.

వ. అనుటయు గురునాథుండు శిష్యున కిట్లనియె. ౧౮౬

అ. గురువిటుల శిష్యునికిఁజెప్పఁదొడంగెను.

క. పిండాండ మాదిగ మఱి బ్ర
హ్మాండము సర్వంబు దెలియు మటజీవాత్మం
డుండు నెలవు గనుఁగొని త

పిండాండ మునందున్న ♦ ప్రేమ ముడుగఁగనౌ. ౧౮౭

తా. పిండాండము మొదలు బ్రహ్మాండమువరకుగల సర్వపదార్థములు విచారించి జీవుండుండుచోటును దెలిసికొని పిండాండము నందలి ప్రేమను విడువ వలయును.

క. పరమాత్మా లోకనత
త్పరుఁడ వగుచు విశ్వమంతఁ ♦ దజ్జీవాత్మం
బరమాత్మ లీనతాను
స్థిరుఁడవైన లేదా కేఁత ♦ చింతయు నరయన్. ౧౮౮

తా. నీవు పరమాత్మాలోకనపరాయణుండవై తన్మయత్వంబునొంది జీవాత్మని వదులుము. పరమాత్మయందు లీనమైనమనస్సు గలనీకిక యేవిచారము తోఁచనిలేదు.

—* గురుశిష్య సోదర చర్యాజ్ఞాన విచారము. *—

వ. అనిన శిష్యుం డిట్లనియె. ౧౮౯

తా. అంత శిష్యుఁడిటులఁబల్కె.

సీ. ఎట్టివాఁడు గురుండున్ నెట్టనంబుగ శిష్యు
లెవ్వరు సోదరులెట్టివారు
సంస్తుతింపఁ గఁదగున్ చర్యయెట్టిది పర
మజ్ఞానమెట్టిదిన్ మనమలరఁగ
నానతీ వలయుఁ దన్ తత్త్వార్థంబులును గాఁగ
ననుటయు నతనికిన్ ట్లనియెగురుఁడు
ఎవ్వగియుండు నూన్ హింపంగఁ దనకంటె
ఘనతరంబగు ప్రజ్ఞన్ గలిగియుండు

తే. గీ. వారలందఱు గురువులున్ వంద్యులెపుడు
జ్ఞానమునఁ దనకంటెనున్ హీనులైన
వారలెల్లను శిష్యులున్ వరసహోద
రులుసమాన విద్యాకలిన్ తులుజగమున. ౧౯౦

తా. మహాత్మా! గురువనఁగా నెటువంటివాఁడు. శిష్యులెట్టివారు? సోదరులనఁగ

నెట్టివారు? చర్యయెట్టిది? ఉత్తమజ్ఞానమెట్టిది? తత్త్వార్థమేమి? దీనినంతయు వివరముగాఁ జెప్పుమన్న గురువు— అతనిజూచి శిష్యా! తనకంటె పెద్దలైన బ్రహ్మజ్ఞానులందఱు గురువులు. వారందరు వందనీయులు. తనకంటె జ్ఞానహీనులగువారందఱు శిష్యులు. సమాన విద్యావంతులు సోదరులుసుమా?

క. ప్రకృతి వరనిష్ఠ యెయ్యది
ప్రకటంబుగ నదియచర్యౌ బ్రహ్మమయంబీ
సకలంబును నసియు తెలియుట
యకలంకజ్ఞానమదియౌ యగుడధ్యము గాఁ. ౧౯౧

తా. శ్రేష్ఠమగు నిష్ఠయే చర్యయనఁబడు. ఈసర్వము శివుండని తెలియుటయే జ్ఞానంబగు.

—* ఇతరుల కొనర్చుహితాహితకర్మఫల విచారము .*—

వ. అనవుఁడు శిష్యుఁడు. ౧౯౨
క. ఇతరులకు నరుఁడు హితా
హితములు గావించి యాతఁ డేలాపొందుఁ
విత్తతంబుగ సుఖదుఃఖ
ఫలితతుల నిహ మందునైనఁ బరమున నైనఁ ౧౯3

తా. అంతశిష్యుండు గురువునిజూచి గురూత్తమా! మానవు లితరులకుఁజేయుచు పకారాపకారములకు ఫలంబుల పొందుదురా?

తే. గీ. అనినగురు వర్యుఁడిట్లనుఁ నన్యులందు
నహితహితమైన హితమైన నాచరించి
నట్టికర్మఫలము మీఁదఁ గానిపుడె
యైన భోక్తవ్యమగునస్సంశయంబులేదు. ౧౯౪

తా. అంతగురువు "శిష్యా! నీకీసందియమేల? ఇతరులకొనర్చిన హితాహిత కర్మఫలమును వెంటనేగాని, తరువాతగాని, అనుభవింప వలయును. తప్పదు.

సీ. ఒక్కసూత్రంబునఁ బెక్కుమాణిక్యంబు
లున్నచందంబున నుండునొక్క
యాత్మయందు చరంబు లైనదేహంబులు
నచరంబులైన దేహంబులట్లు
కావున నద్వైత కారణంబునసట్టి
కర్మఫలంబు నిక్కంబుగాఁగ
బురుషుఁ డనుభవించుఁ బరమాత్మయందు జీ
వాత్మ పొందఁక నైక్యంబుఁ బొంద
తే. గీ. కుండునందాఁక నొకటిపో నొక్కతనువుఁ
బొందితా శుభాశుభకర్మ భోక్తయగుచు
బహువిధములగు సంసార బంధములను
జిక్కువడు మోక్షమార్గంబుఁ జెందలేక. ౧౯౫

తా. ఒకదారముననసేక మాణిక్యము లుండినటుల ఒకపరమాత్మయందే చరాచర దేహంబులన్నియుఁ బ్రకాశించుచుండును. సచ్చిదానంద రూపుండగు పరమాత్మయందు జీవుఁ డైక్యంబు చెందునంతవరకు నొకతనువును వదలి మరొకతనువును గ్రహించుచు శుభాశుభకర్మంబుల ననుభవించుచు సంసారబంధమునబడి మోక్షము బొందలేడు.

—* యోగ ప్రాశస్త్యము. *—

క. అటుగాన దేహముక్తికిఁ
బటుయోగజ్ఞానివగుచుఁ బరమాత్మకుఁ బ్రా
కట జీవాత్మకు నైక్యము
ఘటియింపఁగఁ జేయుమనఘ కడుశీఘ్రమునన్. ౧౯౬

తా. కావున శివయోగ మభ్యసించి జీవాత్మైక్యముచే కూర్పవలయును.

తే. గీ. గణనలేని మహాపాతకములు చేసి
వివిధ భూతావళులఁ జంపి విశ్వమెల్ల
దగ్ధముగఁ జేసి పొందెడు తత్ఫలంబు
నుత్తమజ్ఞాన బలమున యోగి పడయు. ౧౯౭

తా. లెక్కలేని మహాపాపంబు లాచరించి యనేక జంతువుల జంపి యాగాదుల వలన పొందెడి మహాఫలము నుత్తమ జ్ఞానమున యోగిపొందును.

శా. యోగజ్ఞానముకంటెఁ బుణ్యము ఫలం బొండేమియుం లేదొగిన్
యోగ జ్ఞానము కంటె నన్యమగు మోక్షోపాయముం లేదిలన్
యోగజ్ఞానముకంటె నిశ్చలసుఖం బొండేమియుంగల్గదీ
యోగ జ్ఞానుల కంటెఁ బూజ్యులును లేరుద్యద్గతిం జూడఁ గాన్.

తా. యోగ జ్ఞానముకన్న మిన్నయగు వేరొక పుణ్యంబుగాని మోక్షోపాయము గాని శాశ్వతానందము గాని లేదు. శివయోగజ్ఞానులకంటెఁ బూజ్యులును జగంబున మరొకరు లేరు.

క. ఇదిసత్యం బిదినిత్యం
బిదిపరమ రహస్య మితర మెల్లఁ గ్రమమునన్
వదలుము యోగజ్ఞానము
పదిలంబుగ నాత్మనిలిపి బ్రతుకుము వత్సా. ౧౯౯

తా. కుమారా! ఇదిపరమ రహస్యము. ఇదియేసత్యము. దీనినీవు నభ్యసించుము. ఇతరంబు పరిత్యజించుము.

క. భువిఁ బెక్కు మాటలేటికి
శివలింగమునంటి నీకుఁ జెప్పెద వినుమా!
శివయోగాన్యక్రియ దు
ర్భవ వశవర్తినియె చూవె పరమార్థముగాన్. ౨౦౦

తా. నిజముగా నేశివలింగముమీఁద చేయునిడి ప్రమాణపూర్వకముగాఁ జెప్పుచుంటి ఇంతకన్న పరమార్థ సాధకమగు నదిమరొకటి లేదు.

చ. ఇదిబహుశాస్త్ర జాలముల నెన్నినసార తరార్థనిం తయున్
విదితము గాఁగఁ జెప్పితిమి విన్నక దీనికి నెందునెక్కుడై
నదియొక యింత యుంగలుగ దైనను నీమదిలో నసిష్ఠమై
య్యదియుటఁ జెప్పు మన్ననతఁ డా గురు మూర్తికి భక్తి నిట్లనున్.

తా. ఇదియనేక శాస్త్రముల సారాంశము. దీనికంటె నెక్కుడైనది మరొండును

తే॥ నీమనమ్మున నిత్యమేది యావచింపుమన శిష్యుండిట్లనియె.

క. జీవాత్ముని జూడ గనరా
దావలఁ బరమాత్ముఁ గానక నలవియె చక్షు
ర్భావముల కగోచరమగుఁ
గావునఁ దద్యోగ మెట్లు గలుగఁగ నేర్చున్. ౨౦౨

తా. మహాత్మా! గురువరా! జీవాత్మనే చూచుటకు శక్తి లేని నేను, చక్షు-లకుఁ గాని, మనస్సునకుఁ గాని, యగోచరుఁడగు పరమాత్మ నెట్లు గాంచఁగలను. ఆవిషయమును, తెలిపినన్ను సంసార బంధమునుండి తొలగింపు మన్న గురుఁడిట్లనియె.

క. అనుటయు గురుఁడిట్లను శి
ష్యుని తోడన్ శ్రవణ మనన శుద్ధ నిదిధ్యా
సనములు మూఁడును దగు సా
ధనములగున్ సాధ్యమునకుఁ దత్త్వజ్ఞునకున్. ౨౦౩

తా. శిష్యా! మంచి ప్రశ్న నడిగితివి. ఆపరమాత్మను తెలిసికొనుటకు శ్రవణ మనన నిదిధ్యాసలని మూఁడుపాయములు గలవు.

క. శ్రవణంబున మననమ్మగు
ద్వివిధంబునఁ గల్గుమతిని దిధ్యాసనమీ
త్రివిధంబు నాత్మదర్శన
మవ్వుటకు హేతువని చెప్పిరార్యులు జగతిన్. ౨౦౪

తా. నిరంతరము పరమేశ్వరుఁ డిట్టివాఁడని వినుటచేత మననము గలుగును. ఈ రెంటిచేత నిదిధ్యాసము చేకూరును. అందువలన నాత్మగన్పించును.

వ. అది యెట్లనిన. ౨౦౫

తా. అదియెటు లనఁగ.

చ. శ్రవణము వేదవాక్యములన్ సమ్మతి విన్కి-తదర్థశాస్త్రసం
భవపటు యుక్తులా మననమ్ భావము రెంటి నెఱింగి ధ్యేయవ
స్తువును గురూక్త మార్గమునన్ సుస్థితిఁ జింతనచేత ధ్యానమీ
త్రివిధమునన్ నిరూఢుఁడగున్ ధీరుఁడు గాంచు శివస్వరూపమున్

తా. శ్రవణమన వేదవచనములఁ బ్రీతముతో వినుట. మననమన - వేదశాస్త్రార్థములఁ బలుమారు తలంచుట. నిదిధ్యాసమన శ్రవణ మననంబులచే నెఱిఁగిన ధ్యేయవస్తువును గురువు చెప్పిన చొప్పున ధ్యానము చేయుట. ఈమూఁడిటి యందును కార్యసిద్ధిపొందినవాఁడు శివస్వరూపమును గాంచును.

వ. అదియునుం గాక. ౨౦౬

తా. మఱియును,

తే. గీ. సిద్ధ రసవశమున వినుమ శీఘ్రమున సు
వర్ణమగు భాతి సద్గురు వశతఁ దన్నుఁ
దానకనుఁ గాసి యాత్ముండు తన్మయమును
బొందుఁ గడువేగ మునమునఁ ద్భుతము గాగ. ౨౦౭

తా. పరసువేది వలన యినుము బంగార మగునటుల గురు వుపదేశించిన విధంబున దన్నుదాను దెలిసికొని జీవుండు పరశివస్వరూపంబు నొందును.

క. క్రమమున బహుకర్మపరి
భ్రమహేతువు లైనగురులు పరఁగఁ దలఁచులో
కమునం బునరావృత్తిప
దమునకుఁ గారణము గారు తలపో యంగన్. ౨౦౮

తా. కర్మమార్గమును బోధించు గురువులు లోకంబున ననేకులుగలరు. వారు పునరావృత్తికిఁ గారణ భూతులు. అనఁగాఁ గర్మల నాచరించిన వెంటనే తత్ఫలములను స్వర్గలోకముఁ బొంది పుణ్యక్షీణము కాగానే తిరిగి లోకంబున జన్మించుదురని భావము.

ఉ. వారక మోక్షకాంక్ష గలవారికి వారలతోడి దేశికా
గ్రామణి సాత్మ యందశివ దర్శన నిర్మల బుద్ధిమైనసా
ధారణ కారణం బయిన ధన్యుఁడు గల్గిన యోనతండు వి
స్తారత తత్త్వ భావుఁడగు సద్గురు నాథుఁడు వంద్యుఁడెల్లెడన్.

తా. మోక్షమును గోరువారికి వారలతోఁ బనియేమి, ఆత్మయందే శివదర్శనము గలుగఁజేసిన మహానుభావుఁ డెల్లకాలము, వందనీయుఁడు.

## —— * మాయా విచారము * ——

సీ. అని గురుండాన తిచ్చిన శిష్యుడిట్లను
మాయయేగతి నుండుఁ మహిత చరిత
తద్విలక్షణమైనఁ తత్త్వమెట్టిది తద
తీతమెయ్యది యైనఁ దేట పడఁగఁ
గలదేని నదియునుఁ గదియింప వలయునా
కనుటయు శ్రీగురుఁ డతనితోడ
ననియె నీయడిగినయర్థంబు గంభీర
మెంతయులెస్స ము న్నిటి మహాత్మ

తే. గీ. లైనసుజ్ఞాన నిరతులఁ చే ననూన
భంగిఁ జెప్పఁగఁ బడియెఁ దఁ త్వరత వినుము
ధరణి మొదలైన పంచ భూ తములు మాయ
తద్విలక్షణ జీవాత్మ తత్త్వ మొనరు. ౨౧౧

తా. అనివచింపగా శిష్యుండు గురువును జూచి మహానుభావా! మాయ యనఁగా నెట్టిది? ఏవిధముగానుండును? దానినతిక్రమించిన తత్త్వ మేది? దానికంటె విలక్షణమైనది యేది? అట్టి దేది యైననుండిన నాకు వచింపుమనఁగ- గురువు శిష్యుని ప్రేమతో జూచి, వత్సా నీవడిగిన ప్రశ్న మెంతయు బాగుగనున్నది. అదియతి గంభీరార్థము గలది. ముందుమహాత్ములైన సుజ్ఞానులు దానిని జెప్పియుండిరి. అదివచించెద. శ్రద్ధాళుఁడవైయాలింపుము. పృథివి. ఉదకము- తేజస్సువాయువు-ఆకాశమునను పంచభూతములును మాయయనఁబడును. దీనికంటె వేరైనది జీవాత్మతత్త్వమని తెలియవలయును.

తే. గీ. అదిమనశ్శక్తి యండ్రు త త్త్వార్థ విదులు
తన్మనోంతము లైన త త్త్వంబు లాటుఁ
గడచి యింద్రియా తీతుఁడై గరిమ మెరసి
పరమ పదుఁడై వెలుంగును బరశివుండు. ౨౧౨

తా. తత్త్వవేత్తలుదానిని మనశ్శక్తి యనిచెప్పుదురు. మనస్తత్త్వముచివర గలయా తావాద్యుతత్త్వములను వదిలి యింద్రియా తీతుఁడై వెలింగెడి వాఁడు పరశివుండు.

క. స్వానుభవంబున నపరిమి

తానందము గ్రందుకొనఁగ నాపరమాత్ము
డైన శివు నెఱుఁగుచుం ద
ల్లీనుఁడ వై సుఖివి గమ్ము లీలఁ గుమారా. ౨౧౩

తా. స్వానుభవంబున నానందరూపుండగు పరశివుని నెఱింగి యాతనియందు లీనమైన మనస్సుగలిగి శాశ్వత సుఖంబును బొందుము.

—: శివాశివాది నామంబులుగల వస్తు విచారము:—

వ. అనినవిని శిష్యుండు దేవా! శివంబును, నశివంబునగు-శివాశివ పరమాత్మకంబును- కేవలంబును సహజానందంబు ననఁదగు నవియె వ్వి,యవ్విధంబు నాన తీనలయునని విన్నవించిన తదీయాంచిత ప్రజ్ఞా విశేషంబునకు నెంతయు సంతసించి గురునాథుఁ డిట్లనియె.

తా. అంతశిష్యుండు" గుర్రువరా! శివము- అశివము శివాశివ పరమాత్మ కేవలము సహజానందమునను నవియెవ్వి! తెలియఁజెప్పుమన గుర్రుండిట్లనియె.

క. శక్తి మహామాయయగుఁ
శక్తిపయి శ్శివుఁడు వెలుఁగు సచరాచరసు
వ్యక్త జగజ్జాలము శివ
శక్తి మయంబయ్యె ననఘ సకలము నరయఁ. ౨౧౪

తా. శిష్యా! శక్తియే మహామాయ. శక్తిపై వెలింగెడి వాఁడు శివుండు. ఈచరాచర ప్రపంచమంతయు శివశక్త్యాత్మకము.

క. వినుపుణ్యంబును స్వర్గం
బును మోక్షంబును శివుండు మునుశుభము సుఖం
బును నిష్ప్రపంచ కంబుచు
ననునీయేడును శివాహ్వయము లై యుండుఁ. ౨౧౫

తా. పుణ్యము- స్వర్గము- మోక్షము- శివుఁడు- శుభము- సుఖము- నిష్ప్రపంచము- ఈయేడును శివముని పేర్లుగలవి.

క. మునుకొని దురితము దుర్గతి
యుచుమఱి బంధంబు శక్తి యునున శుభముఁగ

న్గాన దుఃఖంబు ప్రపంచము
ననఁగాన య్యేమనయ్యె నశివాహ్వయముల్. ౨౧౭

తా. దురితము- దుర్గతి- బంధము- శక్తి- అశుభము- దుఃఖము ప్రపంచము అను వీనే దను- అశివము- లను పేర్లుగలవి.

తే. గీ. శక్త్యతీతంబు శివమయ్యె శక్తియశివ
మయ్యె నా రెంటికిని పరం బైనదాది
కారణం బై నది యనామకంబనంగ
సవిదితంబయ్యె విమల విచారవినుము. ౨౧౮

తా. శక్తి కంటె నతీతమైనది శివమనిచెప్పబడును. శక్తియ శివస్వరూపము. ఈ రెంటికిని బరంబై మూలకారణమై నామరహితమై సుప్రసిద్ధమై పరశివతత్వంబు వెలుగు చుండును.

తే. గీ. ఇదియ కొందఱు సప్తమపదమయనియు
గరిమఁ గొందఱు షడ్వింశకంబనియును
వేఱె కొందఱు తత్త్వార్థక విమలు నాల్గు
తొమ్మిదుల మీఁద నని చెప్పుదురు గ్రమమున. ౨౧౯

తా. దీనికొందఱు సప్తమపదమనియు- షడ్వింశమనియు- షట్త్రింశత్తత్త్వాతీతకమనియు. క్రమముగా జెప్పుదురు.

వ. మఱియు నదియ పరతత్త్వంబును ధ్యానధ్యేయ వివర్జితంబును నిరాశ్రయంబును నిరాలంబంబును నిష్కళంకంబును గేవల సహజానందంబును, వినాశోత్పత్తి వివర్జితంబును, నప్రమాణంబును, ననాకారంబును, బరబ్రహ్మంబును నని బ్రహ్మవిదులెఱుంగుదురని గురుస్వామికి శిష్యుండిట్లనియె. జగద్వ్యాపారంబు సత్పురుషులకైన నతి దుస్తరంబని తలంచెద. తత్సుఖోపాయం బానతీవలయు ననుటయు గురుప్రభుం డిట్లనియె. ౨౨౦

తా. దీనిని నానంద స్వరూపంబుగను- వినాశోత్పత్తిరహితముగను- పరశివ త

శ్వంబుగను బ్రహ్మవేత్తలు వచింతురన శిష్యుండు గురువుని జూచి దేవా? తామువచించిన యశ్రుతి వాక్యముల నాలించి యానందంబు నతిక్రమింపశరంబు గాదని పెద్దలువచింతురు. అందుకు సుఖో పాయంబేదిమైన నుండిన వచించి యీభక్తుని దర్శింపఁ జేయుమని ప్రార్థింప నాతఁడు కృపాళుఁడై యిట్లనియె.

క. వ్యాపారాంతరము స్వభా
వ్యాపరిమిత నిత్యసౌఖ్య । మని చెప్పఁగనే
లా పరసుఖము ప్రపంచ
వ్యాపార ప్రభవమెల్ల । యనితలఁపనగుఁ౯. ౧౧౧

తా. వత్సా! జగద్వ్యాపారమునకు సుఖంబు లేదనియు. వ్యాపారాంతరము గలదనియు వచింపనేల? ప్రపంచ వ్యాపార ప్రభవమైన దంతయు సుఖంబుగనే భావింపుము.

ఆ. వె. తలఁచి సుఖివిగమ్ము । ధన్యాత్మ యనవుఁడు
శిష్యుఁడధిక వినయ । శీలుఁడగుచు
ననియెగురుల వాక్య । మునకునుకల్పోక్తి
గాదయయినను నను కె గంగ వలయు. ౧౧౨

తా. ఇటులఁ దలఁచి సుఖవంతుఁడవు గమ్మన శిష్యుండు గురూత్తమా! ప్రపంచంబు కల్పితంబని చెప్పుచున్నారు గదా?

క. సిక్కముఁగ బ్రపంచ సుఖ
మెక్కడ సర్వంబు నతిశ । యించిన బ్రహ్మం
బెక్కడ యని మదిదలఁచెద
నొక్కట నీసంశయంబు । నుడిగింపఁ దగుఁ౯. ౧౧౩

తా. నిజము విచారింపఁగా ప్రపంచ సుఖమెచ్చట! సమస్తమును నతి క్రమించివెలుంగుచున్న పరశివుం డెక్కడ? కల్పిత ప్రపంచ సుఖంబునకు పరశివానందంబునకు పర్వత పరమాణువులంత భేదంబు గన్పించెడి. ఈసంశయము విచ్ఛేదము చేయుమనగురుండిట్లనియె.

వ. అనిన విని గురు నాథుండు " సర్వం కల్పితం బ్రహ్మ " యను వాక్యంబు శృతి గతంబగుటం జేసి స్వభావంబున బ్రహ్మ ప్రపంచం

బులకు భేదంబు లేదు. జీవాత్మ పరమాత్మ భేదంబజ్ఞాన వశంబున
గలిగిన యట్లు బ్రహ్మప్రపంచంబగుఁ గావున నది విద్వజ్జనంబు
లకు గలుగదు. దూర దృష్టికి స్థూతంబు నందు సర్ప భ్రమంబు
ను నెండ మావులయందు జలభ్రమంబును శుక్తియందు రజతభ్ర
మంబును బుట్టిన యట్లుకాదె పరబ్రహ్మంబునందు దృశ్య భావంబ
నుటయు శిష్యుం డిట్లనియె. ౨౨౮

తా. వత్సా! "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని శ్రుతి వచించు చున్నది. వస్తుతః బ్రహ్మ ప్రపంచములకు భేదంబులేదు జీవాత్మ భేదంబు నజ్ఞానంబున గలిగిన విధంబున బ్రహ్మ ప్రపంచ భేదంబునజ్ఞులకు గలుగు, పండితులకు జనింపదు. పరశివ స్వరూపంబునం దు ప్రపంచ భ్రాంతి రజ్జుసర్ప భ్రాంతివలె వలెను గొందఱికి జనించును. అంతియేగానియ థార్థముగా లేదన శిష్యుం డిట్లనియె.

——* మృత్యు లక్షణ విచారము *——

సీ. సురలును దైత్యులు♦ నరులును మొదలైన
సర్వశరీరులు♦ జగతి మృత్యు
వశులని సద్బుధ♦ వర్యులవలన వి
నఁగఁబడు నెట్టిచం♦ దంబు మృత్యు
లక్షణమనిపఁ బ్రే♦ ర్త్వాక్ష మహేశ్వరుఁ
డాగురుండిట్లను♦ నతసికెలమి
మెఱయంగ నోతండ్రి♦ మేలెంతియును శోభ
నము నీవడిగిన ప్ర♦ శ్నము మహాత్త
తే. గీ. రంబు పూర్వవిపశ్చిదు♦ క్తంబు మోక్ష
మిచ్చుయించిన వారల♦ కెల్ల నెఱుఁగఁ
దగిన యది యోగవినుతంబు♦ దాని నెఱుఁగఁ
జెప్పెదమునీకు నవధాన♦ మెుప్పవినుము. ౨౨౯

తా. గురువరా! దేవతలు- రాక్షసులు- మానవులు మొదలగు సర్వ ప్రాణులును మృత్యువు నోటబడు దురని తమబోటి పెద్దలువచింతురు. ఆమృత్యు లక్షణమును గొంచె

ము వివరింపుఁడనిన, ప్రత్యక్ష మహేశ్వరునివోలె వెలుంగుచున్న నాగురుండు-శంద్రీ! నీవడిగినవిషయ మత్యుత్తమము. మోక్షము నభిలషించిన వారెల్లను తెలిసికొనఁదగిన విషయము. దానినివచించెద వినుము.

క. మృత్యువనఁగ సంసారము
సత్యంబుగ దీనిఁగడవ శక్యముగాదే
కృత్యముల నెట్టివారికి
నత్యంతము దుఃఖహేతు వవ్వనెల్లపుడున్. ౨౩౮

తా. అత్యంత దుఃఖ హేతువగు నీసంసారము గడువనేరికి శక్యము గాదు. మృత్యువనఁగా నీసంసారమే సుమీ?

క. ఐనననూన శివజ్ఞా
నానందత నిర్మలాత్ములై నకృతార్థుం
డేనాఁటనైన వెఱవఁ
డేనః పరిపూర్ణమైన యీసంసృతికిన్. ౨౩౯

తా. పాపభూయిష్ఠ మగు నీసంసారమును జూచి శివజ్ఞానమున నిర్మలమైన మనస్సు గలవార లెన్నటికిని భయ పడరు.

వ. బ్రహ్మజ్ఞుండు గానివాఁడు నిరంతరంబు సంసారంబు వలననుండిసంసారంబునుంబొందుచుండు- "మృత్యోస్సమృత్యుమాప్నోతి" యను శ్రుతియథార్థంబుగాన మఱియిట్టి సంసారులకుఁ గలుగుదుఃఖంబును జన్మప్రకృతివృత్తియు దోషంబును మిథ్యాజ్ఞానంబును ధర్మాధర్మంబులుఁగూడ సంసారలక్షణంబగు తద్దుఃఖం బిరువదియొక్క భేదంబులుగలిగియుండు, నెట్లనిన. శరీరంబు త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణ మనంబులను యింద్రియంబు లాఱును, శబ్దస్పర్శ రూపరస గంధమనంబులను విషయంబు లాఱును, తద్బుద్ధులాఱును, సుఖంబును దుఃఖంబునని చెప్పంబడు నదియునుంగాక. ౨౪౦

తా. బ్రహ్మను దెలియ నేరని వాడు "మృత్యోస్సమృత్యు మాప్నోతి" యను శ్రుతి చెప్పున నొకజన్మనుండి మరొక జన్మను బొందు చుండును. వీరికిఁ గలుగు దుఃఖము- మి

థ్యాజ్ఞానము- ధర్మాధర్మములు-సంసార లక్షణము. ఈసంసారమందలి దుఃఖము- శరీరము-త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణ మనస్సు లారును శబ్ద స్పర్శ రూపరసగంధ మనంబులు- ఆరును, తద్బుద్ధు లారును- సుఖదుఃఖములు రెండును కలిసి మొత్తము యిరువది యొకవిధంబున గలుగు చుండును.

సీ. మొదలు మిథ్యాజ్ఞాన ◆ మున సంభవించురా
　　గంబును ద్వేషంబుఁ ◆ గ్రమముతోడ
నారెంటివలన ధ ◆ ర్మాధర్మములు గల్గు
　　నందుజన్మ ప్రాప్తి ◆ యగురయమునఁ
దన్నిమిత్తము సం ◆ తతమును దేహిదుః
　　ఖము బొందునట్టి దుః ◆ ఖము వినాశ
మగుట యెట్లన్న మి ◆ థ్యా జ్ఞానసంక్షయం
　　బున దేహాలకు దోష ◆ ముక్తియగును
ఆ. వె. దోషముక్తియైనఁ ◆ దొలఁగు ధర్మాధర్మ
చయములవి దొలంగ ◆ జన్మముడుగు
జన్మముడిగెనేని ◆ చర్చింపనెత్తి
నైన దుఃఖమింక ◆ కైనలేదు. ౨౨౯

తా. మొట్టమొదట మిథ్యాజ్ఞానము- అందువలన రాగద్వేషములును- దానివలన ధర్మాధర్మములును, దానిచే జన్మమును, దానిచేత దుఃఖములును ప్రాణులు పొందు చుందురు. కాన మిథ్యా జ్ఞానము మొదట నశించినచో దాని వలన జనించిన సమస్తమును నశించును.

క. సమధిక శాఖాన్విత వృ
క్షము మూలము దెగినఁగూలు ◆ గతిమిథ్యా జ్ఞా
నము హతమైనను సంసా
ర మహాదుఃఖంబు దృఢత ◆ రంబుగఁ బొలియున్. ౨౩౦

తా. అనేక శాఖాఫల పుష్పాదులచే నొప్పారు మహా వృక్షము మూలము నరికిన నంతయు నశించునట్టుల మిథ్యాజ్ఞానము నశించిన సర్వదుఃఖములు నశించును.

ఆ. వె. అపుడుగాని దేహి । కపవర్గ సంప్రాప్తి
గలుగనేర్వ నీప్ర । కార మెల్ల
సారమతి నెఱింగి । సంసార వారిధి
యతుల మోక్షతీర । మాశ్రయింపు. ౨౩౧

తా. అప్పుడుగాని దేహికి మోక్షము గలుగదు. కాన నీవిది యంతయు గుర్తెఱిగి యీసంసార మహాసముద్ర తీరము నాశ్రయింపుము.

వ. అనవుఁడు. ౨౩౨

తా. అడిగెను గాక.

తే. గీ. హానియెద్ది మహాలాభ । మనఁగ నెద్ది
కలిత సుగతి ప్రదం బైన । కర్మ మెద్ది
యొసర నెద్ది యుత్కృష్ట ప్ర । యోజనంబు
దేవ యీసర్వమును నాన । తీవె నాకు. ౨౩౩

తా. అనశిష్యుండు మహాత్మా! ఏమార్గమువ లాభము గలుగును? ఏమార్గము నాశ్రయించిన హానిగలుగును? ఏదిసుకృతి గలుగఁ జేయును? ఎయ్యది యన్నిటి యందునుత్కృష్ట మైనది. దీనినంతయు దెలియఁ జెప్పుము.

వ. అనిన శిష్యునకు శ్రీగురుం డిట్లనియె. ౨౩౪

తా. అనశిష్యునకు గురుం డిట్లనియె.

క. యోగాభ్యాస మునకును
ద్యోగించు తలంపులేక । దుస్సంసారే
చ్ఛాగతిఁ గాలము పుచ్చుటఁ
బోగురుతుగ హానియండ్రు । బుధవరు లనఘా. ౨౩౫

తా. వత్సా? అన్నిటిలో యోగమార్గ మత్యుత్తమము. ఈయోగంబు నభ్యసింపక సంసారేచ్ఛాపర తంత్రుఁడై కాలంబును వెళ్లించుటయే హాని యందురు.

క. ప్రాణము లహర్నిశము సం
క్షీణములై వెడలు దేహి । కిక్షణ మైనం

ప్రాణాయామంబునఁ ద
త్ప్రాణా నిలరక్షణము గ ౹ దా లాభమగున్. ౨౩౬

తా. దేహులకు ప్రాణములు క్షీణించి దేహము నుండివెడలి పోవు చుండును. ఆ సమయమున క్షణకాలము నైనను ప్రాణమును నిలుపలేడు. ప్రాణాయామము నభ్యసించి నచోఁ ప్రాణవాయువును లేవకుండ నిలుపుటకు సమర్థు లగుదురు. కావునఁ ప్రాణవాయు రక్షణమే లాభమని చెప్పఁ బడును.

క. సంకల్ప వికల్పములే
పంకం బారయంగ నీక ౹ వైరాగ్య నిరా
తంక మతిఁజేయు కర్మము
గొంకక సుగతి ప్రదంబ ౹ గున్ విమలాత్మా. ౨౩౭

తా. వైరాగ్యము గలిగి సంకల్ప వికల్పములు లేకచేయు కర్మమే సుగతికిఁగా రణ మగును.

క. ఈజగతి నన్యములగు ప్ర
యోజనములు చూడ నప్ర ౹ యోజనములు వి
భ్రాజితముగఁ బరమైన ప్ర
యోజన మూహింపఁగా మ ౹ నోన్మని యయ్యోన్. ౨౩౮

తా. విచారింపఁగా నితరప్రయోజనము లన్నియు నిరర్థకములు. నీచములు. మనోన్మని యొకటిమాత్ర మన్నిటి కంటె నుత్కృష్ట మైనది.

వ. అట్టి మనోన్మని సౌఖ్యం బహర్నిశంబును, శివయోగాభ్యాస పా టవంబున జీవునకుం గలుగు, నందాఁక జన్మజరామరణ స్వర్గనరక దుఃఖాస్పదంబైన బహువిధకర్మ బంధంబు విరుగఁడ గాదనవుఁడుశి ష్యుం డిట్లనిఁయె, నద్వయుండును నతిస్వచ్ఛుండునునైన యాత్మం డెట్లు దుఃఖియగు, నెట్లు సుఖియగు నేమిటం బద్ధుండగు నేమిటఁ ముక్తుండగు నిత్తెఱంగు నా కెఱిఁగింప వలయునని విన్నవించిన నత నికి గురునాథుం డిట్లనియె. ౨౩౯

తా. ఆనన్దోన్మనీ సౌఖ్యము రాత్రింబవలు శివ యోగాభ్యాసముచేఁ గాని చేకూడదు. అది చేకూరిన గాని జన్మ జరామరణాదుల వలన వచ్చు దుఃఖము నశించదు. కర్మబంధము తెగదన, శిష్యుండు స్వామీ! పరమాత్మ నిర్మలుఁడు గదా? ఆతనికి దుఃఖము గాని, సుఖము గాని, కలుగుటకుఁ గారణ మేమి? ఆతఁడు దేనివలన బద్ధుఁడగును? దేనివలన ముక్తుఁడగును వచింపుమన గురుండిట్లనియె.

క. విమల స్ఫాటిక మాణి
క్యము వివిధోపాధి వశత । నట్లన యగుచుం
దము నంద్రితనూ పాధివ
శము నన్గుణియయ్యె నాత్మ । చర్చింపంగన్. ౧౮౨

తా. స్ఫటికమణి తనదగ్గర నెట్టి కాంతిగలవస్తువుంచిన తన కాంతిని వదిలి యొట్టి కాంతిని స్వీకరించినటుల నిర్మలుఁడగు పరమాత్మయుఁ దనుత్రయవశముగ నాయాగుణంబుల గ్రహించుచుండును.

* తనుత్రయ విచారము. *

వ. స్థూల సూక్ష్మ కారణ భేదంబులుగల తనుత్రయము లక్షణం బెట్టిద
నిన స్థూల శరీరంబు నానాగుణ భరిత పంచ మహాభూత సంభరి
తంబై భోగాగారంబై యుండు. సూక్ష్మాంగంబ పంచీకృత గగన
ముఖ సముద్భవంబును పంచ ప్రాణ లింగాత్మకంబును భోగపా
త్రంబు నై యుండు. కారణతను వైన నవాచ్యమహానీయ యనా
ద్య విద్యయని చెప్పంబడు నీ యుపాధిత్రయంబునకు నసన్యంబై
యేకంబైన పరబ్రహ్మంబును దలంపుచుండు తత్త్వజ్ఞుండు. ౧౮౩

తా. తనువులు స్థూలమని- సూక్ష్మమని-కారణమని-త్రివిధము. స్థూలశరీరము భూతపంచకముతోఁ గూడికొని సర్వభోగంబు లనుభవించుటకు నిలయము. సూక్ష్మశరీరము- ఆకాశాదులచేఁ బంచీకృతమై పంచప్రాణ లింగస్వరూపమై భోగపాత్రమై వెలయును. కారణ శరీర మనిర్వచనీయమై యనాద్య విద్య యని చెప్పంబడును. తత్త్వజ్ఞుఁ డీయుపాధిత్రయాతీతమగు పరమాత్మను ధ్యానించుచుండును.

మ. పురసంజ్ఞం బరఁగుం శరీరము । పురంబు ల్యాఁడు నిభ్భంగినే
పురుషుండైన నెఱింగి బహ్మ । మయ సద్బోధోజ్జ్వల ద్వహ్నిచే

సరిదగ్ధంబులుగా నొనర్చి విగతే । చ్ఛాద్వేష యత్నాది వి
స్ఫురితుండై త్రిపురాంతకుండగుఁ । గదా పోలింప నాతండిలన్.

తా. శరీరమునకు- పురమని పేరు- మూడు శరీరములకు- త్రిపురములని పేర్లు. ఈ రీతిగ నేపురుషుండైనను దెలిసికొని రాగద్వేషాదుల వదిలి శివజ్ఞానాగ్నిచే వానిని దహింప జేసి త్రిపురాంత కుండను నామంబు వహింప వలయును.

ఉ. వేయును నేటికిన్వినుము వి । వేకని ధీ! పురుషుండ నాద్య వి
ద్యా యుతుఁడైన వాఁడు యిక । దాకను బద్ధుఁడుఁబోలెఁదోఁచుఁదా
నే యెడఁదద్వి ముక్తుఁడగు । నేని స్వభావమునన్ విముక్తుఁ డి
ట్లా యమల ప్రబోధ విధ । మంతయు శీఘ్రము గల్గుయోగికిన్.

తా. వేయిమాటలేల; వత్సా. వినుము- పురుషుఁడె నాది యగు నవిద్యచేఁ గూడి కొని బద్ధునివోలె దోచుచుండును. కానియథార్థముగా నాతఁడువిముక్తుఁ డేసుమీ? దీని నంతయు శివయోగులు శీఘ్రముగఁ దెలిసి కొందురు.

క. శంకరమగు పరశివయో
గాంకురిత సుఖామృతము న । నాత్మన విద్యా
పంకముఁ బోఁగడిగిన యక
లంకాత్ముఁడు పొందు మోక్ష । లక్ష్మిన్ వత్సా. ౨౮౮

తా. ఎవఁడు శివయోగ జ్ఞానామృతమున, ఆత్మగల యవిద్యా పంకమును గడ్గి చేయునో, ఆతఁడు మోక్షంబు జెందును.

వ. అని యివ్విధంబున. ౨౮౯

తా. ఈప్రకారముగ.

ఉ. శ్రీగురుఁ డాన తిచ్చుటయు । శిష్యుఁడు శైవ రహస్యయోగ శా
స్త్రాగమ నిర్ణయార్థ విదు । ఁడై చెలువొందె నపారచిత్సుఖా
సాగర మగ్న మానసల । సచ్ఛివయోగ విచిత్ర సౌఖ్య సం
భోగ వినోద మోద పరి । పూర్ణకళాసము దీర్ణమూర్తియై. ౨౯౦

తా. గురు వుపదేశించిన విధంబున శిష్యుండు తెలిసి కొని యోగశాస్త్ర రహస్యముల గుర్తెఱిగి చిదానందరస నిమగ్నుఁడై శివయోగియై ముక్తిఁ బొందెను.

క. కావున సద్గురు వరపద
సేవా నిరతులకు గలుగు చిన్మయలీలం
గేవల నిత్యానందము
జీవన్ముక్తి ప్రదైక శివయోగమునన్. ౨౪౭

తా. కాన నెవరు గురుపాదపద్మ సేవానిరతులైమెలంగుదురో, వారికి జీవన్ముక్తి నొసంగు శివయోగమున నిత్యానందము ప్రాప్తించును.

క. శివయోగ పరాయణులై
ప్రవిమల చారిత్రులైన భవ్యాత్ములకున్
వివిధైశ్వర్య ప్రదుఁడా
శివుఁడు వెసం బ్రసన్నుఁడౌట సిద్ధంబుగదా. ౨౪౮

తా. ఎవరు శివయోగ మందాసక్తులో ఎవరు సచ్చరిత్రులో వారి కందఱికి శివుండు ప్రసన్నుఁడై యైశ్వర్యంబు లొసంగును.

క. శివయోగము బోలంగా
భువినే కృత్యములు లేవు బుధులట్లగుటన్
శివయోగాభ్యాసముచే
యవలయు సద్గురు కృపా సమస్తాత్ము లగుచున్. ౨౪౯

తా. భూమియందు శివయోగముతోఁ దుల్యమగునది మరొకటి లేదు. కావునగురుకృపా పాత్రులై శివయోగ మభ్యసింప వలయును.

——— యోగ విచారము ———

వ. అట్టి యోగాభ్యాస క్రమం బెట్టిదనిన యోగంబు నాల్గు విధంబులై మంత్ర లయ హఠ రాజ యోగంబులనం బరఁగుఁ దత్ప్రకారంబు సర్వంబును బూర్వంబున శివప్రబోధిత సిద్ధ మునీంద్ర సమీరితంబై యొప్పుచుండు.

తా. ఆయోగ విధానం బెట్టులన. యోగంబులు మంత్ర యోగమని. లయయో-

గమని- హఠయోగమని- రాజయోగమని నాలుగు విధములు. అద్వి ధాన మంతయు:బూర్వకాలంబున శివుండు సిద్ధులకు వచించె. దానిని వచించెద.

ఆ. వె. ప్రణవమైన నక్షర ద్వయంబైన ష
డక్షరంబయైన నక్షరాష్ట
కంబయైన మోక్ష గరిమకై సతతంబు
మదిఁజపించు నతఁడు మంత్రయోగి. ౨౫౧

తా. ఒక్క ప్రణవము గాని, రెండక్షరముల మంత్రమును గాని, షడక్షరీ మహామంత్రము గాని, అష్టాక్షరీ మంత్రమును గాని మోక్షమునకై యెవఁడు జపించునో, వాఁడు మంత్రయోగియన బడును. ఇదియే మనుయోగము.

మ. ఎనయున్వాయు మనోయుతంబుగ నిజ ధ్యేయ స్థలంబందునై
ననుగా దేప ననాహతాహ్వయ మహా నాదంబు నందైన నె
వ్వని చిత్తంబు ప్రపంచ వర్తన మొగిన్ వర్తించి లీనంబగున్
వినుతింపన్ లయయోగి యాతఁడు గదా విశ్వంభరామండలిన్

తా. ఎవఁడు తనచిత్తమును ప్రపంచవ్యాపారము నుండిమరలించి, అనాహత మహానాదంబు నందుగాని తానుధ్యానింపఁ దలచిన స్థలంబు నందుగాని వాయు మనోయుతంబుగా నిర్విలీనము చేయునో, అతఁడులయ యోగియనబడును. ఇదియే లయయోగము.

సీ. అష్టాంగ మార్గము నందు నాసన బంధ
కరణ ముద్రాభ్యాస నిరతినైనఁ
కేవల కుంభక క్రియనైన వాయువు
వశమగు చుండు నెవ్వనికి నతఁడు
హఠయోగి యనఁదగు నటలక్ష్యములు మూఁట
బ్రహ్మ సాక్షాత్కార భరితుఁడైన
యుజ్జ్వలాత్ముఁడు రాజ యోగియౌ వెండియు
జ్ఞానము నందైన మానసంబు
తే. గీ. వృత్తి రహితమై యుండు నే యుత్తమునకు
నాతఁడును రాజయోగజ్ఞుఁ డనఁగ వెలయు

నుత్తరోత్తర వైశిష్ట్య । మొలయ నెపుడు
యోగములు నాలుగై యుండు । నోలిఁ జిల్లు. ౨౫౩

తా. ఆసన బంధకరణ ముద్రాభ్యాస ములచే గాని, కేవల కుంభక మార్గమున గాని, ఎవనికి వాయువు స్వాధీనమగు చుండునో, వాఁడు హఠయోగి యనఁబడును. లక్ష్య శ్రేయము నందును నెవనికి బ్రహ్మ సాక్షాత్కారము గల్గుచుండునో, ఆఁతఁడు రాజయోగి. జ్ఞానము నందును నెవనిమానసము వృత్తి రహితము—అనఁగాఁ జలించక తదేక నిష్ఠతో నుండునో ఆతఁడును రాజ యోగజ్ఞుఁడనఁ బడును. ఈ యోగముల నాల్గింటిలో మంత్రయోగముకన్న లయయోగము, లయయోగము కన్న హఠయోగమును— హఠ యోగము కన్న రాజయోగమును శ్రేష్ఠములు.

* రాజయోగ మహిమ. *

వ. చతుర్విధ యోగంబుల యందును ముఖ్యంబగు రాజయోగం బొక్కటియు నుత్తమోత్తమంబు. ౨౫౪

తా. అన్నిటిలో రాజయోగముత్తమోత్తమముగఁ జేప్పఁబడినది.

సీ. అతిరహస్యంబైన । యీ రాజ యోగంబు
మూఁడు విధంబులై । మొదట సాంఖ్య
మునుమఱి తారకం । బును నమనస్కంబు
ననఁ బెంపు మిగులునై । దైదులైన
నిజతత్త్వ మెఱుఁగంగ । నేర్చిన సాంఖ్యయో
గంబగునది తార । కంబనంగ
బాహ్యముద్రాజ్ఞాన । భావమంతర్ముద్ర
నెఱుఁగుట యమనస్క । సిద్ధమహిమ
తే. గీ. సాంఖ్య యోగంబు కంటె శ్రే । ష్ఠంబు తార
కంబు తారక యోగంబు । కంటె ప్రబవర
మగుచు నమనస్క మొప్పారు । నంతకంటెఁ
బరమ మొండును లేదండ్రు । బ్రహ్మవిదులు. ౨౫౫

తా. ఈ రాజయోగము సాంఖ్యము- తారకము- అమనస్కము- అనిమూఁడు విధ

ములు. ఇరువదియైదు తత్త్వముల దెలిసికొనుటకు సాంఖ్య యోగమును- బాహ్యముద్రాజ్ఞానము తారకమనియు- అంతర్ముద్ర యమనస్కమనియు దెలిసికొనవలయును. సాంఖ్యము కంటె దారకమును- తారకముకంటె నమనస్కమును శ్రేష్ఠము. దానికంటె నుత్తమమైనది లేదని బ్రహ్మవేత్తలందురు.

ఆ. వె. ఎల్లయోగములకు । నిదియ రాజగుటను
రాజయోగ మనఁగ । రమణ మెఱయు
రాజయోగ మనఁగ । రాజిత శివయోగ
మనఁగ భేదమించు । కైన లేదు. ౨౧౬

తా. సమస్త యోగములకునిది రాజగుటచే దీనికి రాజయోగ మని పేరు. శివయోగమున కును- రాజయోగమున కును భేదమేమియు లేదు.

క. ఇటుఁగఱచుల పల్కైవా
క్పటుతం బ్రసరించుటేమి । ఫలమది సిద్ధిం
చుటగాదు యోగమతి దు
ర్ఘటమని కాకెవ్వరైనఁ । గడఁగక యుండ్రే! ౨౧౭

తా. ధంకాసా దమువోలె వాక్పటుత్వమున సంభాషించుట యోగంబు కాదు. యోగమునకది ఫలంబు గాదు. అత్యంతకష్టమని ప్రయత్నింపక యుండఁగూడదు.

క. ఐనను యోగము తెలుపుకు
రానోపని వానికద్ది । రాయన్నట్లా
గానియది పూనినలిపెడి
యానరునకుఁ గొంగు పసిఁడి । యట్టిది తలఁపన్. ౨౧౮

తా. యోగమనిన తలనొప్పిగల వారికది పాషాణమువలె నుండును. దానిని క్రమముగ నభ్యసించు వానికి నదికొంగు బంగారము వంటిది.

వ. కావున. ౨౧౯

తా. కావున.

క. శివభక్తి రతిని సుజనులు
శివయోగాభ్యాస మెప్పుడు । జేయంగ దగున్

శివకర సహజా నందము
శివయోగ పరాయణులకు ♦ సిద్ధించు వెసన్. ౨౬౦

తా. శివభక్తి గలిగి సత్పురుషులు శివయోగాభ్యాసమును జేయ వలయును. అట్టి వారికి సహజానందము వెంటనే ప్రాప్తించును.

వ. మఱియు శివయోగం బైదు విధము లై యుండు నెట్లనిన. శివజ్ఞానంబును శివధ్యానంబును శివభక్తియు, శివవ్రతంబును, శివలింగార్చనము నని చెప్పం బడును. అట్లు గావునఁ దదీయ నిష్ఠాపరుల ను శివ యోగీంద్రులనం బరఁగుదు రట్టి పంచవిధ శివయోగపూర్వకంబుగాఁ జతుర్విధ యోగాభ్యాసంబులు సేయు మహాత్ములు నిరంతరంబును నిరుపమాభ్యంతర సుఖానుభవంబునఁ బరమానందంబునం బొందుచు గ్రమంబున నణి మాద్యష్టైశ్వర్య సంపన్నులై భవముక్తులును జీవన్ముక్తులునై సకలలోక పూజ్యులునై యథేచ్ఛాగతిం జరించిన మీఁదఁ బరశివసాయుజ్య సంప్రాప్తులగుచుఁ బునరావృత్తిరహితులై యుండుదు రట్లగుటం జేసి సర్వ ప్రయత్నంబులను యోగాభ్యాసంబు కర్తవ్యంబు. ౨౬౧

తా. ఇంతియు గాక శివయోగము— శివజ్ఞానమని— శివధ్యానమని, శివభక్తియని, శివవ్రతమని, శివలింగార్చన మని యైదు విధములు, కావున వీనియందు నిష్ఠ గలవారందఱు శివయోగు లనంబడుదురు. ఈయయిదు విధములగు శివయోగములు మొదట నాచరించుచు— నాలుగు యోగముల నభ్యసించు వారు మహానుభావులు. వారు, క్రమంబున పరమానందము నొందుచు— అష్టైశ్వర్యము గలిగి జీవన్ముక్తులై సర్వ జనులచేఁ బూజింపఁ బడుచు నంతంబునఁ బరశివ సాయుజ్యంబు నొందు దురు. కావున నన్నిటికి మూలంబు యోగంబు, గాన, తదభ్యాస మావశ్యకంబు.

క. యోగము వలనను జ్ఞానము
వేగమ జనియించు జ్ఞాన ♦ విభవము వలనన్
యోగంబు సంభవించును
యోగ జ్ఞానముల కేల ♦ యొండొంటికిలన్. ౨౬౨

తా. యోగమున జ్ఞానము— జ్ఞానమున యోగము జనించును. ఈరెండును లభించిన

మరొకదానితోఁ బ్రయోజనమేమి?

క. ఆరెండును సిద్ధించుట
కై రక్షింపంగ వలయు • నంగమ్ము వివే
కారూఢ జనులు తెను వా
ధారంబు గదా సమస్త • ధర్మంబు లకున్. ౨౬౩

తా. "శరీర మాద్యంఖలు ధర్మసాధన" మ్మని సర్వధర్మములు సాధించుటకు శరీరము మూల కారణము గదా? కావున నీశరీరమును యోగజ్ఞానముల సిద్ధికై రక్షింప వలయును.

క. నిలుచుశరీరముప్రాణా
నిల మభ్యంతరము నందు • నిశ్చంచలమై
నిలిచినమఱియే వెరవున
నిలువదు దేవతలకైన • నిశ్చయమిదియున్. ౨౬౪

తా. ప్రాణవాయువు నిలిపినచో శరీరము నిలుచును. కాని దేవతలకైన మరొక విధంబున నిలుపశక్యము గాదు.

ఉ. క్షమ్మహీశుల్లనేలుచున • హీనపరాక్రమ లీలనిష్ట శౌ
ఖ్యమ్ములనొందుచుండుమను • జాధిపవర్యులకైనఁ బ్రాప్తకా
లమ్మునఁ బ్రాణవాయువుడో • లంగినసంగమునిల్వదట్ల స
ర్వమ్మును నప్రయోజనము • వారికిఁ బ్రాణము లేనిపిమ్మటన్

తా. చక్రవర్తులై చతుస్సముద్ర వేష్టిత భూమండలమును బరిపాలించు రాజాధిరాజులకైనను మరణకాలము ప్రాప్తించినపుడు ప్రాణములు పోయినవెంటనే శరీరము నిలువదు. కాన ప్రాణము లేనితరువాత సకలము నిరర్థకము.

తే. గీ. ఎంతవిశ్రాంతిగల్గిన • నెంతవారి ౨౬౫
కైన బ్రాణంబుకాలావ • సానవేళ
నిలువరాకుండ బెడఁగిమ • నీషివరులు
తెలియ వలయును బ్రాణంబు • నిలుపువెరవు. ౨౬౬

తా. ఎంతటి విశ్రాంతియున్న - ఎంతటి వారికైనను - అవసానవేళఁ బ్రాణంబు ని

లువను గనుక- ప్రాణంబు నిలుపు విధ మును బాఁడి తులును- బొను రలును విచారింప వలయును.

క. అనిలం బెందాఁక నిలుచు
దనువును సందాఁక జీవి తంబగు నిధనం
బనఁ బడు నది వెడలుతఱిం
బనుకడనట్లౌటవాయు బంధన మొప్పన్. ౨౭

తా. ప్రాణము శరీర మందున్నంత కాలము బ్రతికి యున్నాఁడనియు- అదిపో యినచో మరణించి నాఁడనియులోకులందురు. కావున ప్రాణవాయుని రోధము మానవ మాత్రుని కవసరము.

క. వాయువు చంచలమైనం
గాయము చంచలతఁబొందుఁ గ్రమమారఁగన
వ్వాయువు నిశ్చలమైనం
గాయము నిశ్చలతఁ బొందు గరిమ మెఱయఁగన్. ౨౮

తా. వాయువుచాంచల్యము నొందిన శరీర చాంచల్యము గలుగును. వాయువు చల నరహితమై యుండిన శరీరము కూడ చలన రహితమై యుండును.

———* హఠయోగప్రభావము *———

ఉ. పాయక ప్రాణ వాయువుల పాయము బొందక సుస్థిరంబులో
గాయమునందు నిక్కువము గాఁగఫ నాశనమైన దత్కఫం
బేయెడనైన నుండనిర వేమియు లేక నశించిపోవునో
హో! యమి యోగ్యమైన హఠ యోగమునంగడు సద్భుతంబుగాన్.

తా. శరీరము నందుగాని, రోయాపదయు నొందక ప్రాణ వాయు వుండ నేరదు. అటులఁ బ్రాణ వాయువు స్థిరముగా నుండుటకు కఫము నశించు నుపాయముకను గొనవల యును. ఏలయన కఫము హృదయము నందును- కంఠము నందును- ఇది యది యననేల! సర్వాంగము నందును వ్యాపించి ఘనీభవించుట చేతనే మానవులు చని పోవు చున్నారు. కావునట్టి కఫము నశింపఁ జేసిన ప్రాణములు స్వస్థానములో నుండును. ప్రాణములు నిలిచి న దేహము నిలుచును అట్టి కఫనాశమునకు, ముఖ్యోపాయము మునీంద్ర సేవితమగు హఠయోగాభ్యాసమే.

క. అభ్యుదయ హేతువగు యో
గాభ్యాసము చేయవలయు నాత్మజయముతో
నభ్యంతరమున వాయువు
లభ్యంబగు నేనియదియ యలవడుఁ బేర్మిన్. ౨౭౦

తా. యోగాభ్యాస మభివృద్ధికి హేతువు. ఎప్పుడు వాయువును నిలువు శక్తి గలుగునో అప్పుడుగాని యోగముసిద్ధింపదు.

వ. ఆయుష్యాభివృద్ధికిఁ గారణంబు హఠయోగంబయగు నదియునుం గాక. ౨౭౧

తా. ఆయుష్యాభివృద్ధికి గారణ మీహఠయోగమేయని దెలియవలెను.

ఉ. ఉన్నత రాజయోగ లలితోజ్జ్వల సౌధమునెక్కఁ గోరు వి
ద్వన్నుత సచ్చరిత్రులగు వారికి నిచ్చెన వోలె నెంతయుం
జెన్నొలయున్ విశిష్టజన సేవ్యమునన్ హఠయోగ విద్య ము
న్మున్నరయంబునం విభవముల్ దొరకించుటఁ దాహఠంబగున్.

తా. రాజయోగ సౌధము నెక్క గోరువారికి హఠయోగము నిచ్చెన వంటిది. దీని నభ్యసించు వార్కికి నిదివరలో నున్న సౌఖ్యంబు నశించు గావున హఠంబని పేరు గాంచెను.

మ. హఠశూన్యం బయినన్ ఫలింపదమలంబౌ రాజ యోగంబొగిన్
హఠయోగంబును రాజయోగ రహితంబౌ నేనిసిద్ధింపదీ
హఠరాజంబులు రెండుఁ గూడ సతతాభ్యాసంబు గావించు ని
శ్చిత నిస్సంశయ భవ్యమానసునకున్ సాధ్యంబగున్ సర్వమున్.

తా. హఠయోగము లేనిది రాజయోగమును, రాజయోగము లేనిది హఠయోగమును, పరస్పరము సిద్ధింప నేరవు. ఈరెంటిని నభ్యసించు వారికి నిస్సంశయముగ సర్వంబును సాధ్యంబగును.

ఉ. కావున రాజయోగ సుఖగౌరవ మొందుటకై హఠంబున
ద్భావన నభ్యసింపఁదగుఁ దానన కాదె శరీర శుద్ధియున్
దేవతలైనఁబొందనియు దీర్ఘతర ప్రథిత ప్రభావముం
గేవల చిన్మయత్వమును శీఘ్రముకల్గుచు నుండుయోగికిన్. ౨౭౪

తా. కాఁబట్టి రాజయోగ సౌఖ్యమొందుటకు హఠయోగాభ్యాస మవసరము. దీనివలననే యోగీశ్వరులు మహాప్రభావమును- చిన్మయత్వమును- శీఘ్రముగా నొందుదురు.

వ. హఠయోగ ప్రభావంబునఁ గదా శ్రీయాది నాథమత్స్యేంద్రగో రక్షాది మహాసిద్ధవరులు కాలదండంబు ఖండించి యఖండ జ్ఞానమండితులై బ్రహ్మాండ భాండంబున నభీష్టగతిం జరింపుచుందురు. వెండియు. ౨౭౫

తా. ఈహఠ యోగాభ్యాసముననే యాదినాథ- మత్స్యేంద్ర గోరక్షాదిమహాసిద్ధులు మహాజ్ఞాన సంపన్నులై స్వేచ్ఛగా సంచరించు చుందురు.

సీ. సంసార సంతాప । సంతప్తులకును స
మానస మాశ్రయ । మఠము హఠము
యోగి జనంబుల । కోలినన్నింటికి
మండితా ధారక । మ్యము హఠము
కామాది శత్రు సం । ఘాతంబు బెదరించు
మహితనాదంబు త । మ్మటము హఠము
పరమ సాధకుల క । పార సౌఖ్యంబులు
సమకొల్పు నెడల ని । శ్చితము హఠము

తే. గీ. చంద్ర సూర్యాగ్ని సంగమ । స్థల నిబద్ధ
గంధవహ విస్ఫుర ద్వహ్ని । ఘనశిఖా ప్ర
కీర్ణ నిర్మలాంత స్సుధా । కిరణ విగళి
ద మృత ధారానిపాత స । ద్ఘటము హఠము. ౨౭౬

తా. ఈహఠయోగము సంసారమను నెండలో నుండివచ్చిన వారికిఁజల్లనినీడనొసంగు మఠము వంటిది. యోగుల పాలిటికిది యాధారము. కామాదిశత్రువుల భయపెట్టుటకునిది భేరీనాదమువంటిది. తననుసాధించిన వారికనంత సౌఖ్యములొసంగునది. చంద్రసూర్యాగ్ని మండలముల చెంగట దహరాకాశంబున మహాజ్యోతియై వెలుఁగు వహ్నిశిఖ యొక్కలోని యమృతకిరణముల నుండి వెడలిన సుధాధారలు పడునట్టి ఘటమువంటిది సుమా! ఈ హఠయోగము.

వ. మంత్రలయ హఠరాజ యోగంబులలోన మంత్రయోగం బధమం
బది యనుష్ఠించు వాఁడును నధమాత్ముఁడ నంబడు. లయయో
గంబు మధ్యమం బగునది మధ్యమ సత్త్వుం డనుష్ఠించు. హఠయో
గంబుత్తమం బది యాచరించు వాఁడుత్తముఁ డనంబడు, నిట్టి హఠ
యోగంబునం గాని యత్యుత్తమ రాజయోగంబు సులభంబు గాదు,
గావున, వేదశాస్త్రార్థ పరిజ్ఞాతయు నిర్మలవిజ్ఞాన వైరాగ్య మాన
సుండును బ్రబల ధైర్య సంపన్నుండును నగు మానవుండు హఠ
యోగాభ్యాసంబున కధికారియగుఁ దదనుసంధాన మార్గం బె
ట్టి దనిన. ౨౭౭

తా. నాలుగు యోగములలో మంత్రయోగమధమము. అది యాచరించెడి వారు ప్రాకృతమతులు. లయయోగము మధ్యమము దీని ననుసరించెడి వారు మధ్యములు. హఠయోగ ముత్తమము. దీని నుత్తము లాచరింతురు. ఇట్టి హఠయోగమున గాని రాజయోగ ములభింపదు గాన, వేదశాస్త్రములు దెలిసికొని. మనోవైరాగ్యము గలిగి ధీరుఁడై హఠయోగాభ్యాసమునకును ప్రక్రమించ వలెను.

క. శివయోగము సాధకునకు
నవశ్యమును సాధ్యమగుఁ గదా సాధనమం
త్ర విశేషగతి హఠయోగము
రవిశశి సంఘటన మది విరాజిత మహిమన్. ౨౭౮

తా. సాధనమంత్రముల శివయోగము సాధకునకు సిద్ధించును. హఠయోగము సూర్యచంద్ర సంఘటన మునగాని గలుగదు.

క. అది హాకార ఠకారము
లాదినపతి చంద్ర సంజ్ఞ లగుఁ దద్యోగ
శ్రీ దొరకొనిన హఠంబగు
నాదట నిరునాలుగయ్యె నయ్యంగములున్. ౨౭౯

తా. హాకార ఠకారములు సూర్యచంద్రులకు సంజ్ఞలు. ఆరెండును గలిసిన హఠమనఁ బడును. అనంతర మీరెండ పదములును నిరువది నాలుగయ్యెను.

## —* అష్టాంగ విచారము. *—

వ. అష్టాంగంబుల యందు బాహ్యంబులు నాలుగును, నభ్యంతరం
బులు నాలుగును నై యుండును. ౨౮౦

తా. ఎనిమిది యంగములలో నాలుగు బాహ్యములనియు నాలుగు ఆభ్యంతరములనియు వచింపఁ బడును.

క. యమనియ మాసనములు ప్రా
ణ మారుతాయామము నన ♦ నంగా బాహ్యాం
గములగు ప్రత్యాహృతి ధ్యా
నము ధారణయట సమాధి ♦ నానాంతరముల్. ౨౮౧

తా. యమము- నియమము- ఆసనము ప్రాణాయామము అనునాల్గును బాహ్యాంగములు. ప్రత్యాహార ధ్యానధారణ సమాధులు నాలుగును అభ్యంతరములు.

ఆ. వె. యమము మొదలుగా మ ♦ హాత్ము లష్టాంగ యో
గముల శివుని బూజ ♦ యమరఁ జేసి
సకల సిద్ధులును ని ♦ జంబుగాఁ బొందుచు
భవ విముక్తులగు దు ♦ గ విరళముగ. ౨౮౨

తా. మహాత్ములీ యష్టాంగ యోగముల శివుని బూజించి సర్వ సిద్ధుల నొంది సంసారము నుండి తరింతురు.

క. వినుతాష్టాంగ విధానత
బున వంతః పద్మనిలయ ♦ మునయంద శివా
ర్చనఁ జేసినఁ గాక కలవె
యనూన భద్రమ్ము లిందు ♦ నందును నెపుడున్. ౨౮౩

తా. హృత్పుండరీకంబున నష్టాంగ విధానమున శివపూజఁ జేసిన గాని యైహికాముష్మికభోగముల మానవులు పొందనేరరు.

## ఆశ్వాసాంతము

మ. రవిజహ్నుప్రభవ ప్రసిద్ధతటినీ సంగమ ప్రదేశోరువై
భవధాత్రీ జలవహ్ని వాయుగగన ప్రవ్యక్త వర్ణస్థలీ
నివసత్పావక మండలాగ్ని నిలయ స్నిగ్ధార్క మధ్యస్థితాం
దవ బింబస్ఫురదాత్మ లింగసతత ధ్యానావధానాత్మకా. ౨౯౪

తా. కాళిందీ జాహ్నవీ నదీమ తల్లి కలచే వ్యాప్తమై పృథ్వ్యాపస్తేజో వాయ్వాకాశ వ్యక్తమగువర్ణప్రదేశములందున్న సూర్యచంద్రాగ్ని మండలములయందు ప్రతిబింబించు నాత్మ లింగ ధ్యానము నందునిశ్చల చిత్తముగలవాఁడా.

క. ఆధారాదిక షట్క్రమ
లాధార సితాంత సుఖ క రాంతర్నాడీ
శోధక మరున్నిరోధ క
హాధారణ ధర్యనిరుప మాద్భుత చర్యా. ౨౯౫

తా. ఆధారాది షట్క్రమ లంబుల నవలంబముగ గలిగినిత్యంబు సుఖంబు లోసంగి లోనినాడులను పరిశోధించి వాయువుల నిరోధించుట యందు నిరుపమాన సామర్థ్యము గలవాఁడా.

### మాలినీ.

అతులిత సువి చారా వ్యాప్తమాయా విదూరా
హాతమదరి విశారా హాటకాద్రీంద్ర ధీరా
శ్రితజల ధిగభీరా శిష్యచేతో విహారా
సితభసిత శరీరా సేవితా హీశహారా. ౨౯౬

తా. అనుపమానమైన జ్ఞాన విచారముగలవాఁడా! మాయాతీతుఁడా! అరిషడ్వర్గమును జయించిన మహాను భావుఁడా! సాగరముబోలు గాంభీర్యమును మేరువుబోలు ధైర్యమును గలవాఁడా? శిష్యుని మనంబున విహరించు వాఁడా! భస్మలిప్త శరీరుఁడవై యీశ్వరుని సేవించు మహాత్మా నాకనారాధ్యా! [స్వీకరింపుము]

## గద్య

ఇది శ్రీగురు చెన్నసదాశివ యోగీంద్ర పదారవింద మధుకరా
యమాన నిరంతర శివభక్తి సమాధాన కొలనియాది మూల
నామాత్యపుత్ర యన్యస్తుతి పరాఙ్ముఖ శివస్తుతిసుముఖ
కవిజన మిత్ర సరస కవిత్వ విరచిత పరిభావ గ
ణపతి దేవ ప్రణీతం బైన శ్రీశివ యో
గ సారమునం దుత్తర భాగంబున
ద్వితీయాశ్వాసము
సమాప్తము.



# తప్పొప్పుల పట్టిక.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | ౧౬ | ద్వర్గ్వ | ద్వర్గ |
| ౩ | ౨౧ | నరక | నరకం |
| ” | ౨౨ | దృవా | ధృవం |
| ౪ | ౧౯ | దిలివ | దిలిప |
| ౧౫ | ౧౩ | దాతృ | ధాతృ |
| ౧౬ | ౧౩ | భావన | బావన |
| ౨౧ | ౧౧ | గాఢం | గాధం |
| ౨౩ | ౧౨ | పాశా | పాశ |
| ౨౪ | ౨౬ | బల | బిల |
| ౩౦ | ౧౭ | నది | నధి |
| ౩౮ | ౨౦ | బురుండ | బురద |
| ౪౯ | ౧౯ | యొదురు | యెదురు |
| ౫౩ | ౨౬ | నెందుగకు | నెందుకు |
| ౫౯ | ౬ | లంచ | దలంచ |
| ౬౦ | ౧౭ | శివో | శివయో |
| ” | ” | జేకూరు | జేకూర |
| ” | ౨౬ | మఱిన | మఱియున |
| ౬౮ | ౨౬ | రానారుతత్వ | రుతత్వ |
| ౭౨ | ౧౧ | గఱిమల | గఱిదల |

సమాప్తము.



# అనుబంధము

అరిషడ్వర్గముల గూర్చి యీగ్రంథమునఁ జక్కఁగాఁ వచింపఁ బడినది. అరిషడ్వర్గ మన- కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు. వీటిస్వరూపమించు విస్తారముగ గలదు.

లోకంబున "వాఁడా స్త్రీరత్నమును గామించి నాఁడు. ఆ కాంతామణియాపురుషుని మోహించినది." అనివ్యవహరింపఁ బడుట యనుభవ సిద్ధము. అట్టితరి యారెండు వాక్యములకుఁగల భేదము స్థూలదృష్టికి బోధపడక యేకాభిప్రాయము నేవ్యక్తపరచుచున్నది.

కామ క్రోధాదుల లక్షణమింతఁ జెప్పఁబడినను సామాన్యులకు సులభముగా నందువలన వచ్చెడి సుఖదుఃఖములఁ దెలియుటకై చిన్నికథల వ్రాయుటయు- ముఖ్యమని తోచుచున్నది. అరిషడ్వర్గ పరస్పర తారతమ్య మొకచో నిరూపించిన, పాఠకులకు సులభముగా బోధపడవచ్చుననను నూహయొకటి స్ఫురించుచున్నది.

రాగ- ద్వేష- ఈర్ష్యాసూయా దంభ దర్పాహంకారములను వీటితోఁ గలిసియరిషడ్వర్గము పదమూడు విధములుగ గొందరిచే నుడువఁబడినది. కామ మోహములకు వలె- ఈర్ష్యాసూయలకును భేదము గన్పించుటలేదు. కావున వీటిస్వరూప మంతరము నిచ్చుట వ్రాయుట యవసరమేయగుచున్నది. అందువలననే యీయనుబంధ మారంభింపబడినది.

## కామము.

కామము- అనఁగఁ "గోరిక" యనియర్థము. ఈకోరికకు నంతము లేదు. గృహములు- తోటలు- ధనధాన్యములు స్త్రీలు- మొదలగునవి యెక్కువఁగ సంపాదించ వలయునను చిత్తవృత్తియే కామమని కొందరి యాశయము స్త్రీవిషయక మగు ననురాగమే- కామమని మఱికొందరు- "కందర్పో దర్పకోనంగః కామః పంచ శరస్స్మరః" అను వచనమును బట్టి కామోద్రేక మనగ- మన్మథోద్రేక మనివేరొక కొందఱు వచించిరి.

చతుర్విధ పురుషార్థములతో- కామ మొక పురుషార్థముగాఁ జేర్కొనఁ బడి నది. ఎవరెన్ని విధముల వ్యవహరించినను- కామమనుమాటకు కోరిక యని యర్థము చెప్పుటయే సమంజసముగా దోచుచున్నది ఆకోరిక- స్త్రీవిషయమై యగుగాక- లేక మరో విషయమై యగుగాక. అన్నిటికిని సమన్వయింపవచ్చును.

ఆకోరిక- స్త్రీకంటె నితరములగు వస్తువుల విషయమై యున్నచో- నది యాశే

యనియు- మిక్కుటమైనచో- నత్యాశయనియును వ్యవహరింపఁ బడుచున్నది. స్త్రీల నిమయమై యుండునచో- కామమని లోకంబున వ్యవహరింపఁ బడుచున్నది. "ఆ స్త్రీని కామించినాఁడు" అనఁగ "ఆ స్త్రీని కోరినాఁడు" అనియన నమ్మును. గృహాదుల విషయమై కామించినపుడు- నటులనఁ గూడదు.

గృహాదులను సంపాదింప వలయునని తలంచినపుడు- నాటి విషయమై "కోరిక" యనియేవ్యవహరించుదురు. పరస్త్రీవిషయక మగునపుడను రాగము గలిగి యున్నాఁడనియు- (గామించి నాఁడనియు- నందురు. ఇంతకుఁ దేలిన సారాంశమే మ[illegible]నఁగా- "కోరిక" యనియే యర్థమనియు- ధనాదులను గోరిన- కోరిక యనియు- స్త్రీవిషయమై నపుడు కామమనియు- లోకవ్యవహారముగలదనియు భావము.

ఇట్టి కామమును నిరాకరించిన గాని, ముక్తికాములకు- ముక్తి లభింపదు. కోరికలు నశించుటయు- స్త్రీలను కామింపక యుండుటయు ముక్తిమార్గమునకు సోపానములు.

స్త్రీలను గామించి- విశ్వామిత్రాది మహాత్ములు తమతపస్సును గోల్పోయిరి. సీతను గామించి గదా? రావణాసురుఁడు రామునిచే మడిసెను. అహల్యను గామించి దేవేంద్రుఁడు కోడియై కూసి గౌతమ మహర్షిచే శపింపఁబడెను. శచీదేవిని గామించి నహుషుఁడు పదభ్రష్టుఁ డయ్యెను. నరకాసురుఁడనేక స్త్రీలను జెఱఁబట్టి కృష్ణునిచే మడిసెను. ఈవిధము గ స్త్రీలనుగోరి విపత్తులఁబొందినవారికి మితిలేదు కావున పరస్త్రీలను గోరుటంతటి కష్టము.

తనకున్న దానితో తృప్తినిఁ బొందలేక రాజులనేకులు చక్రవర్తిత్వ మభిలషించి చనిపోయిరి.

ధనమును గోరి- పలువురు ప్రాణత్యాగము చేసిరి. గృహములను- తోటలను- నెక్కుడుగ సంపాదింప వలయునని యనేకులు- వారిజీవితముల నందులోనే గడిపి మరణించిరి. కావున నట్టి కామమును నిగ్రహించిన గాని- మోక్షము లభింప నేరదు.

## క్రోధము

తాను జేయుపనులకు- నెవఁడు విఘ్నములుగలుగఁజేయునో- తానుపలుకుచున్న పలుకులకువిరుద్ధముగ నెవఁడుమాటలాడునో- అట్టివానిని శిక్షింపవలయునను నుగ్రమగుచిత్తవ్యాపారమే క్రోధమనఁబడును. ఈక్రోధమువలన లోకమున ననేకులువినాశమును బొందిరి. క్రోధమును బరిత్యజించినవాఁడు ముక్తికర్హుఁడని శాస్త్రములు వచించుచున్నవి. మనుష్యులు- క్రోధములేక శాంతినవలంబించిన గాని, ముక్తిమార్గమును గనుగొనఁ జాలరు. క్రోధావిష్టునకు- నున్మత్తునికి భేదములేదు. క్రోధపరవశులై వీరరసాతిరేకమున రణరంగమున మడిసినవారికి లెక్కలేదు. క్రోధము వహించినవాఁ డెంతటి దుష్కృత్యములనైనను బల్కుటకు వె

మకంజ చేయుఁడు, [illegible]నివలననే యాతనికి మరణము సంభవించును. ఇందుకొక చిన్నకథ నాలింపుఁడు.

## —బకాసురవధ—

ఏకచక్రపురమున బకాసురుఁడను నొక రాక్షసుఁడు గలఁడు. అతఁడు గ్రామమునందలి మనుష్యులను— జంతువులను— తనకుఁ గావలసినంతవరకు భక్షించి ప్రజలను మహాబాధలఁ బెట్టుచుండెను. అతనిచేఁ గొన్ని కుటుంబములు మొదలంట గూలిపోయినవి. కొన్ని గృహములందు భర్తలుండిన భార్యలు లేకయు భార్యలుండిన భర్తలు లేకయు భార్యాభర్తలుండిన పిల్లలు లేకయు ననేకులు శోకసాగరమున మునింగిరి. ఇట్టిస్థితి గలుగుటకుఁ గారణము ఈ రాక్షసుఁడు తనయిష్టము వచ్చినటుల భక్షించుటయే.

అతనివలని నాబాధల సహింపఁ జాలక గ్రామస్థులతనితో రాజీ కుదుర్చుకొనిరి. మూఁడుపుట్లబియ్యమును— నందుకుఁదగిన వ్యంజన సామగ్రియు— నొకమానవుని— విలవసుగా పంపుచుండిరి. అతఁడొప్పుకొని గ్రామమునకు రెండుమైళ్ల దూరమునున్న తాళవృక్షవనమున నివసించెను.

పాండవులాకాలమున నొకబ్రాహ్మణుని యింటియందు మారువేషముల నుండిరి. ఆబ్రాహ్మణునివంతు వచ్చినది. అతఁడు నేను చనిపోయినపక్షమున నీవుమాత్రము పిల్లలను నెట్టులోఁ గాపాడగలవు. కావున, నేనే యాహారముగఁ బోవుదునని భార్యతో ననెను. "మీరుపోయిన నాబ్రతుకేటికి? సంపాదించువారెవరు? నేనుజనిపోయినను మీరుసంపాదించి పిల్లలను బోషించవచ్చును. కావున నేనే చనిపోవుదును." అనిభార్య యనెను. వారికుమార్తె యొకతె యీవార్తవిని తల్లిదండ్రులారా! నేనెప్పుడైనను నొకనియింటికి పోవలసినదే గదా! నేనే యారాక్షసుని కాహారముగఁ బోవుదును దుఃఖింపకుఁడనెను. అంత నాతని నాలుగేండ్లబాలకుఁడొక గడ్డిపరకను గైకొని నేనీ గడ్డిపరకతో వానిఁగొంతుకోతునని యనెను. ఆబాలకుని పలుకులాలకించి తలిదండ్రులు దుఃఖింపసాగిరి.

అప్పుడు కుంతీదేవి తనపుత్రుని పంపెదననియు— అతఁడాతని వధింప సమర్థుఁడనియు ఒకవేళ నాకొమరుఁడే చనిపోయినను నాకయిదుగురు కొడుకులుగలరనియు— వచించి తనకుమారునితోఁ జెప్పెను.

అంత గ్రామస్థులందఱు రాక్షసబాధ నేటితోఁదీరునని దలంచి సంతసించి మూఁడుపుట్లబియ్యమన్నమును దానికిఁదగిన సామగ్రి యొసంగి యొకదున్నపోతులబండి నొసంగ భీముఁడు దానినిగైకొని వెంటనే బకాసురుని చెంతకేగి అతఁడుచూచుచుండఁగ నేదినుచుండెను. బ

కాసురుఁడు మండిపడి యాతని యొద్దకువచ్చి యొకగ్రుద్దు గ్రుద్దెను. భీముఁడు చిరునవ్వున వ్వుచుఁ దెచ్చినపదార్థమునంతయు దినువరకు మాటలాడలేదు. ఎన్నిదినములనుండి భీమునకాహారము తృప్తిగలేదు. నేటికిసంభవించినందుల కాతఁడెంతయు సంతసించెను.

బకాసురుఁ డాహారములేక మండి పడుచున్నాఁడగుటచేఁ ద్వేషముగా ననేక దూర్భాషల నాడుచు నొకతాళవృక్షమునుబీకి యుద్ధమునకు సన్నద్ధుఁడాయెను. భీముఁడును తానుదెచ్చిన పదార్థమంతయు సమాప్తమగుటచే సమరమునకు దిగెను. ఇరువురికిఘోరయుద్ధము జరిగినది. చివరకు భీమసేనుఁడు బకాసురుని జంపి వేసెను. ఆతని కళేబరమును బండిమీదవేసికొని యేకచక్రపురము ప్రవేశించెను. అందరాతని బలాక్రమమును గొనియాడిరి. రాక్షసపీడ పోయెనని వారుసంతసించిరి

చూచితిరా! బకాసురుని పల్కులకు విరుద్ధముగా బల్కుటయగాక ఆతనికి సమర్పించ వలసిన యాహారము సమర్పింపక పోవుటచేనాతఁడుగ్రుఁడై మండిపడుచు దురుక్తులపల్కుచు భీమసేనునితోయుద్ధమారంభించి మడిసెను. నీ క్రోధమేగదా! కారణము.

ఏకచక్రపురవాసులగు బ్రాహ్మణుల వధపట్టించినయితనిబీడించుటచే వారందరు బకాసురు నెటుల శిక్షించుదమా? యని యాలోచించి యాతనిమీదికి భీముని పంపుటకు గారణము క్రోధమేకదా? కావున నట్టిక్రోధమును విడచుట ముఖ్యము.

## లోభము

లోభము మానవుల కపకీర్తి హేతువు. లోభమనఁగ ధనము లభించిన పదార్థములను నితరుల కియ్యగూడదను జిత్తవ్యాపారము. దీనిచేతమనుష్యు లప్రతిష్ఠను బొందుచున్నారు. "వీనికెంతధనముండినను లోభిసుమీ" యని లోభగుణముగలవారలు లోకులపరిహాసములకుఁ బాత్రులగుచున్నారు.

పాండవులకు భాగ్యము లేదనియు నూడి మోపునంత భూమి యయినను నీయనని యుపలికిదుర్యోధనుఁడుతననున్న రాజ్యమునీయక పట్టుబట్టుటకులోభగుణంబేగదా కారణము.

అతఁడే లోభంబునఁ దనజ్ఞాతులకుఁ బంచిపెట్టక పుత్రమిత్ర సోదర బంధువులతో గూడ మరణించెను. లోభంబునఁ బాపం బతిశయించును. కావున నట్టిలోభగుణము జయించినగాని మానవులు ముక్తి నొందజాలరు. లోభికెప్పుడు సుఖముగలుగదు. అతఁడెంతధనము నొకచోగిడ్డబెట్టిను గూడ దినఁడో, అంతవర కాతనికి సుఖ మెక్కడిది? ఆతనిగణించు వారెవరు? ఆతనిభార్యాపుత్రాదులు గూడ నతని జక్కఁగాఁ జూచుటకు నంగీకరింపరు. కాన నట్టిలోభమును విడచుట ముక్తి హేతువు.

## మోహము

మోహమనగా- దారకళత్ర పుత్ర మిత్రాదులందు నతిశయమైన ప్రేమగలిగి యుక్తాయుక్త కృత్యములనెఱుంగని చిత్తవ్యాపారము. దీని నతిశయప్రేమ-యనిగాని భ్రమయనిగాని యనవచ్చును. మోహమున మగ్నుడగువాడు- ప్రపంచమునే మరచియుండును. ఆ స్థితిలో నేమి చేయవలయునో, యెఱుంగడు. పిదప నేడ్చినను లాభము లేదు.

శ్రీరామునికి దశరథుడు పట్టాభిషేకము చేయ నిశ్చయించెను. సుముహూర్తము పెట్టిరి. పట్టణమలంకరింపబడెను. మంథర యను దాసి దశరథుని భార్యయగు కైకకు దుర్బోధ గలిపెను. నీకుమారుడగు భరతునికి రాజ్యము లేదనెను. కైక యదియంతయు నమ్మి భర్తమీద యలిగినటుల పరుండెను.

దశరథుడు శ్రీరాముని పట్టాభిషేక మహోత్సవమును దనకత్యంత ప్రేమసర్వస్వముకు కైకకు జెప్పనేతెంచెను. కైకను వెదకి కనుగొని కోపమునకు గారణ మడిగెను. కైక చెప్పలేదు. దశరథుడు ప్రతిమాలెను. నాకు వెనుక తామొసంగుదు మనిన వరద్వయము నిప్పుడొసంగుట కభయ మీయుమని కైక దశరథుని నడిగెను. అతడొప్పుకొనెను.

రామునికి బదునాలుగు వత్సరము లరణ్యవాసమును- భరతునికి రాజ్యపట్టాభిషేకమును నను వరద్వయమును నభిలషించెను. ఈవార్తను వినుటతోడనే దశరథుడు మూలము నరికినవృక్షము గూలినటుల నేలగూలెను. రాముడాసమయంబున లక్ష్మణ సమేతముగా వచ్చి తండ్రిని బలుకరించెను. కాని, యాతడు మూర్ఛితుండై పడియుండెను, మాట లాడలేదు. ఆవార్తనంతయు దెలిసికొని రాముడప్పుడే సీతాలక్ష్మణ సమేతుండై యడవికేగెను. దశరథుడు కొంతవడి స్మృతి దెలిసి రాముడడవి కేగిన వార్తను విని విచార సాగరమున మునింగెను. అది మొదలుకొని పుత్రప్రేమచే మహాదుఃఖము ననుభవించుచు, పుత్రముఖమును జూడకనే యతడు మరణించెను. కావున పుత్రాదుల మోహము ముక్తికి విరోధము.

దశరథునివంటి ధీరుడు- పుత్రవంతుడు- కైకయందలి మోహముచే, దన నియమభంగమునకు పీడజాలక- వరద్వయ మొసంగినను- పుత్రమోహమున మరణించవలసిన దుర్దశ సంభవించినది. కావున నిట్టి మోహము విడుచుట యుక్తము.

## మదము

మదము మానవునకు పలువిధముల సంభవించును. విద్యావంతునికి విద్యామదము- ధనవంతునికి ధనమదము యౌవనవంతునకు యౌవనమదము, బలవంతునికి- బలమదము- ఈరీతి

గ వనేక మదములు ప్రోవగును.

మదమనఁగా సకల సంపదలు గలిగి గర్వాంధుఁడై నేనేమి చేసినను చెల్లుననెడి చిత్తవ్యాపారము. దీనినిఁదొలఁగించినగాని ముక్తిమార్గము బోధపడదు

జమదగ్ని మహర్షి హోమము చేయుచుండెను. ఆతనివద్ద హోమధేనువు గలదు. కార్తవీర్యార్జునుని కుమారులాధేనువును మదంబున నపహరించిరి. అపహరించుటయే గాక పరశురామునితో యుద్ధమునకు ప్రారంభించిరి. పరశురాముఁడు మహాక్రోధంబున వారలతో యుద్ధముచేసి యమపురి కంపెను. వారు రణరంగమునఁ గూలఁగనే కార్తవీర్యార్జునుఁడెదిరించె. ఆతఁడును పరశురామునిచేత జనిపోయెను. కావున మదించి ముందుగా నెవ్వరి మీదికి పోరాదు. అట్లుపోయినచో నాశము తప్పక గల్గును. కాబట్టి మానవులు మదమును విడిచినగాని, ముక్తిమార్గమున కర్హులు గారు.

## * మాత్సర్యము. *

మాత్సర్యమన- ఇతరుల శుభమును జూచి ద్వేషించుట. ఇతరులు తనకంటె నధికముగు విద్య- సంపత్తు- చక్కదనము- భోగము- పలుకుబడి- మొదలగు వాటిని గలిగియున్నారని యోర్వజాలక మండిపడు చిత్తవ్యాపారమే మాత్సర్యమనఁబడును. దీనిచేత చాలమంది నశించిరి.

ఓర్వజాలకుండుట మంచిది కాదు- ఇందువలన ననేకములగు కీడులు మూడుచున్నవి.

ధర్మరాజు రాజసూయయాగమును జేయుచుండెను. ఆసభయందగ్ర తాంబూలమెవరికీయవలయునని సభాస్తారుల ప్రశ్నించి తదభిప్రాయానుసారముగా నతఁడు శ్రీకృష్ణునికి నొసంగెను. వెంటనే శిశుపాలుఁడు లేచి తనకు శత్రువగు కృష్ణునకు దాంబూలమిమ్ముటకు నోర్వజాలక- కృష్ణుని నూరుతిట్లు తిట్టెను. కృష్ణుఁడు సహించెను. నూటొకట్టి తిట్టు విన్పింపగానే యతఁడిదివరలో నిచ్చిన వరము చెల్లినది గనుక చక్రమును బ్రయోగించి వాతని కంఠము ద్రుంచివేసెను. కావున మాత్సర్యము కూడదు. మత్సరగ్రస్తులందరికి నేదోయొక విధమున హాని సంభవించుట యనుభవసిద్ధము. కావున నట్టి మాత్సర్యగుణమును దూరముగా దొలగించి వేయవలెను. లేనిచో నది మోక్షప్రాప్తి బాధకమగును.

ఇంతవరకు- కామక్రోధాదుల విషయము సంగ్రహముగ వచింపఁబడినది. ఇక రాగాది సప్తక విషయమును నుడివెదను.

## —*రాగాది సప్తకము.*—

రాగమనగా- పరస్త్రీ విషయకముగఁ గలిగెడు చిత్తవ్యాపారము. దీనిచేత రావణుడు సీతయందను రాగము గలిగి మరణించెను.

రాగాది సప్తక విభాగము చేసినప్పుడు- కామమనఁగా- గృహ ధాన్యాదులెక్కువగ గోరుటయే యని యర్థము చెప్పవలయును.

ద్వేషము- తనకొకఁడుపకారము చేసినప్పుడు తిరిగి వానికపకారము చేయవలయు ననెడి చిత్త వ్యాపారము.

హిరణ్యకశిపుఁడు- తన యనుజుని విష్ణువు చంపినాడని తిరిగి యతని కపకారము చేయఁ దలఁచి యాతనిచే మరణించెను.

ఈర్ష్య తనకు వచ్చిన కష్టము లితరులకు రావలయు ననెడి చిత్త వ్యాపారము.

అరుణాక్షుఁడను వాఁడు తనకు వచ్చిన దుఃఖము తనతోఁ దుల్యుఁడగు వాఁడునికి రాగోరి తుద కాతనిచేతఁ బ్రాణములు గోలుపోయెను.

అసూయ- నాకు వచ్చిన సుఖ మితరునికి రాకూడదను చిత్త వ్యాపారము.

పుండ్రక దేశపు రాజగు వాసుదేవుఁడు- తనకున్న పేరితరునికి నుండ కూడదని యెంచి వాసుదేవునితోఁ బోరి- యాతని వలన మరణించెను.

దంభము నేను చేసినది నితరులు చూచి మెచ్చుకొన వలయుననుచిత్త వ్యాపారము.

అపూర్వుఁడను వాఁడొక యాగమును జేయుచుండెను. అప్పటికి వచ్చిన దూర్వాసునితో "నేను జేయు యాగమును జూడు మనెను. దూర్వాసుఁడిటుల పల్కుట దంభ మనెను. అందు వలన, నపూర్వుఁ డలిగి దూర్వాసుని నిందించి యాతని వలన యాగ వైఫల్యము నొందెను.

దర్పము. నేను సర్వ విషయము లందు సమర్థుఁడను నాతో సమానులు లేరని గర్వించెడి చిత్తవృత్తియే దర్పమనఁ బడుచున్నది

భస్మాసురుఁడీశ్వరుని వలన వరంబుఁ బొంది తనతో సమాను డెవ్వఁడు లేడని గర్వించి తుద కాతని వలననే మృతి జెందెను.

అహంకారము- ఓరి నాసంగతి గుర్తెరుగుదువా? నేను పట్టిన పట్టును బ్రహ్మ దిగి వచ్చినను తుద ముట్టింపక విడువను. అని యితరుల భయపెట్టు చిత్త వ్యాపారమే యహంకార మనఁబడును. త్రిపురాసురులు- శంకరునితో గలహించి యాతని చేతనే నశిసిరి.

ఈరాగాదులారును- కామాదులారును గలసి పదుమూడు దుర్గుణములని వచింప బడినవి. సజ్జనులగు వారలీ దుర్గుణముల పొంతఁబోక పెద్దలగు గురువుల సేవించి తరించ వలయును.

అరిషడ్వర్గమున నంతర్భాగము చేసినను- వీనిని జేయవచ్చును. ఎట్టులనగ- కామమునందు, రాగమును- క్రోధమునందు, ద్వేషమును- దంభము, దర్పాహంకారములు, మదము నందును- ఈర్ష్యాసూయలు మాత్సర్యము నందును నంతర్భాగము చేయ వచ్చును. అట్లు చేసి యేప్రాచీనులు కొందఱతి షడ్వర్గమును వీడిన మోక్షార్థి కారికా వచ్చుననిరి. కావున నరిషడ్వర్గమను పేరును- సమంజసముగనే దోచుచున్నది. అందు వలననే గ్రంథకర్తయు నరిషడ్వర్గ విచారము నారంభించెను.

ఈయరిషడ్వర్గమును జయించిన గాని- మానవులు బ్రహ్మవిచారణమున కర్హులు గాజాలరు. అట్టి యరిషడ్వర్గమును వదిలి- అట్లు వదలుటకు దగిన నుపాయముల గురువుల యొద్ద గ్రహించి మానవులందరియోగాభ్యాసమున కుపక్రమించి తరింతురు గాక.

సర్వేజనా స్సుఖినో భవంతు.

సమాప్తము.



# గ్రంథమాల యందు ముందు ప్రకటింపఁబడు గ్రంథరత్నములు

1 శివయోగ సారము — 3 వ సంపుటము గణపతి దేవవిరచితము.
2 " — ౪ వ సంపుటము "
3 శివరహస్య ఖండము. యుద్ధకాండము — కోడూరు వెంకటాచలకవి ప్రణీతము.
4 బసవ విజయము ... తుమ్మలపల్లి నాగభూషణ కవి
5 లింగధారణ దీపిక ... మల్లికార్జున పండితారాధ్యులు
... భవాని శంకరారాధ్యులు.
6 శివజ్ఞాన శేఖరము ... ఘంటనామాత్యుడు
7 కాళహస్తీశ విలాసము ... కాళహస్తీశ్వరుడు
8 మల్లికార్జున పండితారాధ్య చరిత్ర — సంస్కృతము
9 నందికేశ్వర పురాణము
10 శివరహస్య ఖండము సంస్కృతము అసుర కాండ, వీర మహేంద్ర కాండ, యుద్ధ కాండ, దేవ కాండ, దక్ష కాండ, ఉపదేశ కాండలు వ్యాస మహర్షిప్రణీతము
11 శైవసిద్ధాంత దర్శిని ౨వ సంపుటము 3వ సంపుటము
12 విష్ణుకృత మహిమ్న స్తోత్రము సవ్యాఖ్యానము మల్లికార్జున పండితారాధ్యుల వీరనారాధ్యులు.
13 బసవ పురాణము సంస్కృతము — వ్యాస ప్రణీతము
14 శివాధిక్య శిఖామణి ... రేణుకారాధ్యులు
15 శ్వేతాశ్వతర కల్పసూత్రము — శ్వేతాశ్వతరుఁడు

ఈ గ్రంథము లచ్చు బడుటకు శైవు లందరు తప్పక చందాదారులుగాఁ జేరియు తమమిత్రులను జేర్చియు మాకు ప్రోత్సాహ మొసంగుదు రని నమ్ముచున్నారము.

ఇట్లు
సంపాదకులు.

# శైవప్రచారిణీ గ్రంథమాల

ఇందు అముద్రితములు- అనుపమానములు, అమృతమయ ఆనంద ప్రదములు నగునాలుగు గ్రంధరత్నములు మూడుమాస కొక్కటి చొప్పున ప్రకటింపబడును.

గ్రంథమాల సం॥ చందా రు 4-0-0

---

# శైవప్రచారిణి పక్షపత్రిక

ఇది ప్రతిపక్షమున ప్రకటింపబడు యొక పత్రికారాజము. ఇందు నీతిబోధకములగు కథలు ఆరోగ్యదాయకములగు వైద్యవిధానములు- లాభకరములగు వర్తకవిషయములు- విజ్ఞానమును వెదజల్లు భాషాపద్ధతులు- వివేకమును గలిగించు చక్కని విమర్శనలు- మతధర్మములు- వ్యవసాయరీతులు స్వదేశవిదేశ వృత్తాంతములు నవ్వుపుట్టించు హాస్యములు-తలనూపించు చమత్కారములు వేయేల! సర్వవిషయములు ప్రకటింపబడును.

చందా సం॥ రు2-0-0

గ్రంథమాల చందా దారులకు సం॥ రు0-8-0 మాత్రమే

వలయువారు.

శైవప్రచారిణీ పత్రికా కార్యాలయం
వరంగల్
అని వ్రాయవలయును.